# ఆమె బతుకు పాట "కొత్తపాట"

ఇటీవల అత్యాధునికత అనేది తెలుగు కవిత్వంలో బాగా చర్చనీయాంశమైంది. అత్యాధునికత అనే పద సృష్టి మీదనే చాలా వివాదం ప్రారంభమైంది కూడా! దీన్నే కొంతమంది 'పోస్ట్ మోడర్నిజమ్' పేరుతో ఇప్పుడు పిలుస్తున్నారు. 'ఆధునికత - అత్యాధునికత'లకు సంబంధించి ఇప్పటికే ఒక విశ్లేషణాత్మక గ్రంథాన్ని అఫ్సర్ 1992లోనే వెలువరించారు. సామాజిక విలువల్లో వస్తున్న మార్పు ఈ ధోరణిలో బాగా వ్యక్తమవుతుంది. నేటి కవులు తమ అంతరాంతరాల్లోని సంఘర్షణను, సమాజంలోని వివిధ విషయాలతో కలిపి తమ అంతర్ముఖత్వాన్ని కూడా బయటపెడుతున్నారు. అటువంటప్పుడు కవులు ఒకే చట్రంలో ఒదిగిపోవాల్సిన పనిలేదని భావిస్తున్నట్లు అర్థమవుతుంది. దేనికైనా స్పందించి కవిత్వం రాయవచ్చని అనుకుంటున్నారనీ తెలుస్తుంది.

స్త్రీవాద, దళిత కవిత్వాలను పరిశీలిస్తే స్వంత అనుభవాల నుంచే తమ అస్తిత్వానికై కవులు పడే ఆరాటం కన్పిస్తుంది. ఇటువంటి పరిస్థితులన్నింటినీ ఒక చోట చేర్చి కూర్చిన అనుభవాల, ఆవేదనల, ఆరాటాల త్రివేణీ సంగమంగా డా// ఎస్. శరత్జ్యోత్స్నారాణి గారి 'కొత్తపాట' కవితా సంపుటి ఒకటి వెలువడింది. ఇంతవరకూ చాలా మంది పల్లె నుండి పట్టణానికి వచ్చిన పురుషుల గురించే కవిత్వాన్ని రాశారు. కానీ, స్త్రీ,



పురుషుల మధ్య సమస్యల సుడిగుండాల్లో బాధత్యల బరువు మోయటంలో వ్యత్యాసం లేదని, అందరూ వాటికి అతీతులు కారని చెబుతూ ...

*'కడుపు చేత్తో పట్టుకుని*
*పల్లెవీడి పట్టణం చేరిన*
*పడుచు బ్రతుకును వర్ణించి*
*'మరోవైపు కొనసాగే జీవిత పయనాన్నీ'* చూపించారు కవయిత్రి! 'ముందడుగు' కవితలో *'ఆడపిల్లలకు తల్లినవ్వాలనే కాంక్షతో*
*అమ్మతనాన్ని లోకానికి చాటడానికి*
*నేటి మహిళ ముందడుగు* వేస్తుంది అని చెప్పటం ద్వారా పురుష ద్వేషం ఎలాగున్నా, స్త్రీ పుట్టుక పట్ల గౌరవభావాన్ని పెంపొందించుకోవలసిన అవసరాన్ని, ఆత్మన్యూనత భావాన్ని విడవలసిన క్రమాన్ని ఈ కవిత స్పష్టం చేసింది. అంతే కాకుండా తన ఆశయసాధనలో మనిషి అలసిపోవచ్చు: కానీ దాన్నీ ఓడిపోవటంగా భావించనక్కరలేదని చెబుతూ...

*'ఒంటరి గీతమెప్పుడూ ఏకాకిదై పోదు*
*అనే ఆశావాదంతో 'కొత్తపాట'కి రాగం రావాలంటే*
*గుండె గాయం కావాలి*
*హృదయం అనుభూతులతో నిండాలి*
*అపుడే పుడ్తుంది*
*రాగమైన కవిత్వమైనా*

అంటూ తన 'పాట'ని వినిపిస్తున్నారు కవయిత్రి.

నాన్నని తిట్టే లోకంలో నాన్నలందరూ ఒకలాగే ఉండరనీ...

*'అమ్మ పొత్తిళ్ళలో*
*అందే అమరత్వం*
*నాన్న చేతుల్లో చూశాను'* అని అమ్మలా గోరుముద్దలు తినిపించి, అమ్మనే మరిపించిన నాన్న గురించి చెప్పి, 'నాకోసం మరో అమ్మలా మారాడు నాన్న' అనటం ద్వారా ఒక్కసారిగా హృదయాన్ని ద్రవీభవింపజేసే కవిత్వం ఉరికి బయటపడింది. ఈ కవితా సంపుటిలో అమ్మ మరణాన్ని జీర్ణించుకోలేక రాసిన 'శ్రద్ధాంజలి' తండ్రి ఆత్మీయతను హిమవన్నగ సదృశంగా చూపిన '

అందని ఎత్తు' కవితలు కవయిత్రి తన రెండు కళ్ళ నుండి రాలిన అనుభూతి బిందువులతో కూర్చిన రసభరిత కవితలుగా అభివర్ణించవచ్చు.

ఇంతవరకు సంస్థానాలలో దాగిన సాహిత్యం ఇప్పుడిప్పుడే ప్రజలలోకి వస్తున్నదని కొంతమంది విమర్శకులు చెబుతున్నారు. కానీ, దానిలో కనిపించని లొసుగులు కూడా ఉన్నాయి. వాటిని చాలా వరకు స్త్రీవాద, దళిత వాదాలు బహిర్గతం చేస్తున్నాయి.

*'నాపై కావ్యాలు రాసి*
*సాహిత్య పీఠంపై సమున్నతంగా*
*అధివసించేదీ నువ్వే నాచేత నినాదం సృష్టించి*
*నా గొంతును నొక్కి పెట్టే*
*నాయకుడివీ నువ్వే'* అనే దాన్ని తెలుసుకున్నామనీ, వాటన్నింటినీ ఇక సహించేదే లేదని చెప్తూ...

*'అన్ని చోట్లా అలికిన*
*మీ కుటిలాధిపత్యాన్ని*
*అదిలించటానికే సిద్ధమయ్యాం'* అని ప్రకటిస్తూ ఆత్మగౌరవ అస్తిత్వ హస్తాల్ని పైకి ఎత్తాల్సిన అవసరాన్ని ప్రభోదిస్తున్నారు కవయిత్రి.

దళితులు అగ్రవర్ణాల వారిని నిలదీస్తూ ఆవేదనతో 'మాకు దక్కాల్సిన వెలుతురేదని ఆకాశం గొంతుమీద కాలేసి నిలదీస్తూన్నాం తప్ప, మేం ఎవడి దీపాల నుండీ అక్రమంగా వెలుతురు పిండేసుకోవటం లేదు' అని ప్రశ్నిస్తూనే సమాధానం చెప్పారు. ఇదే ప్రశ్నను మాదిగ దండోరా ఉద్యమం షెడ్యూల్డ్ కులాల్లోని ఉప కులాలకు కూడా డా// అంబేద్కర్ ఆలోచనా విధానం ప్రకారమే మాకు రావాల్సిన సమాన హక్కుల్ని మాకివ్వండని అడిగేసరికి అగ్రవర్ణ భావజాలమున్న దళిత సోదరులు ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. దీన్ని దళితేతరులు కొందరు 'రొట్టె పంచే కోతి' అవతారాన్ని ఎత్తటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ నేపధ్యంతో రాసిన 'తప్పనిసరై .....' అనే కవితలో డా// ఎస్. శరత్జ్యోత్స్నారాణి...

*'కలిసి బ్రతికే బాటలో*
*కలహాలు తప్పవు'* అని చెప్తూ, కురుపాండవుల మధ్య ఉన్న కలహాలు వంటివే దళితుల మధ్య కూడా ఉన్నాయనీ, దీన్ని దళితుల అనైక్యతగా



భావించనవసరం లేదనీ, అవన్నీ కుటుంబంలో జరిగే చిన్న చిన్న వివాదం వంటివేనని చెప్తూ...

*'ఏది ఏమైనా మా అడుగు*
*దురహంకారుల ఆధిపత్యంపై*
*తిరుగుబాటే సుమా!'* అని హెచ్చరించటం కనిపిస్తుంది. ఇంతవరకూ పేర్కొన్న చాలా కవితల్లో అత్యాధునిక కవిత్వంలో కనిపించే లక్షణాలు కొన్ని కనిపిస్తున్నాయి. అంటే అత్యాధునికత లేదా ఉత్తరాధునికతలో కనిపించే విడి విడి పరిష్కారాలే తప్ప, అందరికీ లేదా అన్నింటికీ ఒకే పరిష్కారం సరిపోదని చెప్పడం ప్రధానం. అది వీరి కవిత్వంలో కనిపిస్తుంది. దీనిలో భావంలో నవ్యత, సమాజంలో నిరంతరం జరిగే మార్పులు దర్పణంలో ప్రతిబింబించినట్లు ప్రతిబింబించే కవితలు ఇందులో ఉన్నాయి. ఈ 'కొత్తపాట' కవితా సంపుటిలో మరో విశేషంగా చెప్పుకోదగినవి 'గుండె గుసగుసలు' పేరుతో రస భరితమైన కొన్ని మినీ కవితలను చెప్పుకోవచ్చు. స్త్రీవాద, దళిత వాద, బాల కార్మికుల పట్ల ఆవేదనలను కూడా కవిత్వీకరించారు. ముక్కుపచ్చలారని పసిపిల్లల మీద చేసే లైంగిక దాడులకు స్పందించి రాసిన కవితలు కూడా దీనిలో ఉన్నాయి. భాషలో సారళ్యం, భావంలో నవ్యతను ప్రదర్శిస్తూ, అంత్యప్రాసల్ని అందంగా కూర్చిన కవితా సంపుటి ఇది. దీన్ని చదవటం ద్వారా సమకాలీన స్పందనలను అర్థం చేసుకోవచ్చు.

(ఆదివారం ఆంధ్రభూమిలో 2-07-96న ప్రచురితం)

# దళిత కవిత్వంలో "అమ్మ"

ఇన్నాళ్ళూ కవిత్వంలో "అమ్మ" ప్రసక్తి వచ్చినప్పుడల్లా పిల్లాణ్ణి ఎత్తుకుని చందమామను చూపిస్తూ గోరుముద్దలు తిన్పించే అమ్మరూపమే చిత్రించబడింది. కానీ తమ తల్లుల గురించి దళితుల జ్ఞాపకాలూ, అనుభవాలూ అవి కావని నేటి దళిత కవులు వెల్లడిస్తున్నారు.

సమాజంలో కొందరు తల్లులు పట్టు చీరల్లో, విందుల్లో గడుపుతుంటే, మరికొందరు నిత్యం అవమానాల కాల్వల్ని ఈదుతూ, బతుకు రాళ్ళబాటలో నిత్యం ఆకలి, శిలువల్ని మోసే తల్లులు. వీళ్ళే దళిత తల్లులు. ఈ దళిత తల్లులకు అగ్రవర్ణాల సాహిత్యంలో ఉన్నటువంటి స్థానం లేదు. వాళ్ళ సాహిత్యంలో తల్లి గురించిన అందమైన, సున్నితమైన భావనలకు భిన్నంగా దళిత తల్లి జీవన దృశ్యాన్ని దళిత కవులు కులం కుంచెలతో చిత్రిస్తున్నారు. అటువంటి కొన్ని కవితల్ని చూద్దాం.

దళిత తల్లుల, చెల్లెళ్ళ చరిత్రంతా ఈ సమాజంలో అవమాన పర్వమే. "దేవుడి పెళ్ళాలై" పోయిన సజ్జల గూడెం మహ దేవమ్మలు, పోలీసుల చేతుల్లో నలిగి దుఃఖ సంతకాలయ్యే ఆలీసమ్మలూ, ఈ పవిత్ర భారత మాత కళ్ళ ముందే నూలుపోగు లేకుండా నడి రోడ్డుపై నానా హింసలూ భరించిన చలకుర్తి ముత్తవ్వలూ, పేరేదయితేనేం, దళిత తల్లుల జీవితాల నిండా అవే అవమానాలు! వీళ్ళ జీవితాల గురించి ఏ.సీ.



రూముల్లోనించి తీర్మానాలు చేసే మహిళ సంఘాల నాయకురాళ్ళను నిరసిస్తూ చల్లపల్లి స్వరూపరాణి.

*"అమ్మా!*

. . . . . . . . . . . .

*అసలు నీ స్పర్శ తగలందే*

*ఈ నేలపై గాలీ వెలుతురూ పులకించవనీ*

*నీ చేతులు బురద గుంటల్లో దేవి*

*రత్నా ల చేపలు పట్టందే*

*ఈ దేశం పొట్ట నిండదనీ"* వీళ్ళకు తెలుసునా? అని ప్రశ్నిస్తుంది. "మా యమ్మ" కవితలో ఈ దేశం సస్యశ్యామలమై అన్నపూర్ణగా కీర్తించ బడటానికి ఆధారమైన తన తల్లి శ్రమనూ, దానికి విలువా, గుర్తింపూ లేకపోవటాన్ని గురించి కవయిత్రి ఆవేదన చెందుతుంది.

ఇంత కాలమూ మన సాహిత్యంలో దళిత స్త్రీల దరిద్రాన్ని ఆధారం చేసుకుని వాళ్ళను దొంగలుగా, మోసగత్తెలుగా, వేశ్యలుగా చిత్రిస్తూ వచ్చారు. ఆ దళిత తల్లి దరిద్రాన్నే హృదయ విదారకంగా చెప్పే కరుణ రసాత్మకమైన "అలగా తల్లి" కవితలో మద్దూరి నగేష్ బాబు-

"ఏ ప్రభుత్వాసుపత్రి

శవాల కొట్టు ముందయినా

ఒక కన్నీటి మడుగుని చూశారా

అది మా అమ్మే" అని ఆమె దీనావస్థను కళ్ళకు కట్టిస్తాడు. తన తల్లి కౌసల్యనో, యశోదనో కాదని చెప్తాడు.

*"అందరి తల్లులు*

*ఆదమరిచి సుఖ నిద్రలు పోతున్నప్పుడు*

*నా కూలి తల్లి*

*పెంటకుప్పల మధ్య*

*పరాభవమై పోతుంది"* అంటూ ఎందరో దళిత తల్లుల బలాత్కారాలకూ, అవమానాలకూ గురయ్యే వైనాన్ని ఎలుగెత్తి చాటుతాడు.

కలుపు తీస్తూ, హడావుడిగా మట్టి కాళ్ళతోనే పాపకు పాలిచ్చే తల్లుల్నీ, పాలురాక అమ్మ రొమ్ముని ఆబగా నోటికి అదుముకుంటే

పక్కటెముకలు తగిలే అనుభవాల్నీ తప్ప. పాలు పడుతూనో, జోల పాడుతూనో అమ్మ గుర్తొచ్చే అవకాశం దళితుడికి లేదని

*"ఎవరికైనా అమ్మంటే*
*పాలు పడుతూనో,*
*జోల పాడుతూనో స్ఫురిస్తే*
*నాకు మా అమ్మ కలుపు తీస్తూనో,*
*తట్టలు మోస్తునో*
*గుర్తుకొస్తుందండీ"* అని అమ్మ గురించిన తన చేదు జ్ఞాపకాల్ని చెప్పాడు కవి. ఆమె గురించి చెప్పేందుకు ఈ భాషా, ఈ కవిత్వమూ ఎప్పటికీ చాలవంటాడు.

దళిత తల్లి హృదయం నుంచి ప్రవహించే కన్నీటి గాథల్ని ఎండ్లూరి సుధాకర్ "నల్ల తల్లి"లో వినిపిస్తూ-

*"నా బాల్యానికి భాష లేదు*
*నా బాధ, నీలాంటి వాళ్ళ బాధ*
*మరో మహాభారతమై ఉండేద"*ని చెప్తూ ఆ తల్లుల గాధల్ని సువర్ణమయ చరిత్రలుగా మలుస్తానని శపథం చేస్తాడు.

"నా మాతృ దేశం మీద నా తల్లి జెండా తలెత్తుకుని ఎగురుతుంద"ని ఆశాభావాన్ని వ్యక్తం చేస్తాడు. మత సంప్రదాయాల పేరుతో కనీసమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు కూడా తన తల్లిని దూరం చేసిన సమాజం మీద ఆగ్రహాన్ని ప్రకటిస్తూ, ఆ తల్లుల వేదనను తమదిగా వెలిబుచ్చే కవితలు మైనారిటీ కవుల నుంచి వస్తున్నాయి.

"అమ్మ మెడలో వేలాడే షరియత్ గుదిబండ ఏనాడూ అమ్మను తలెత్తికానీ కనీసం కళ్ళెత్తికానీ ఈ లోకాన్ని చూడనివ్వలేదు.

*"నువ్వు పెనం మీద కాలే రొట్టెపై*
*పిల్లల్ని కనే యంత్రానివై*
*నవాబ్‌సాబ్ నాడా బూటు కింద*
*నలిగిన మల్లె పువ్వైనందుకు"* తన మనసంతా కమురుకు పోతోందని తీవ్ర వ్యధకు గురౌతాడు ఒక కవి. ఎప్పటికైనా అమ్మను ఆ నిర్బంధం నించి విముక్తి చేయాలనే కోరికనూ, నిశ్చయాన్నీ,



*"నీ చుట్టూ ముళ్ళకంచెలు పాతిన*
*మా అజ్ఞానాన్నంతటినీ*
*చిత్తు కాగితాల వారికి అమ్మెయ్యాలనుంద"*ని తెగేసి చెపుతాడు ఖాజా.

కన్నీటి దారాల్తో జీవితానికి మసిలలేస్తూ, తరాల చీకటికమ్మేసిన ఘోషాతో పాలిపోయిన అమ్మ గురించి స్కైబాబా "రెహల్" కవితలో ఇలా *అంటాడు-*

*"తల్లి పాదాల వద్ద స్వర్గం ఉందంటారు.*
*మా అమ్మ పాదాలపై వంగిన ప్రతిసారీ*
*చెమరిన నా చూపు*
*ఆమె పాదాల పగుళ్ళలో చిక్కుకుని*
*గిలగిల లాడుతుంది."* అంతేకాదు,
*"చీకటిరాసుల్ని మోస్తున్న అమ్మ*
*చివరకు ఖురాన్‌ను మోసే "రెహల్"గా మిగిలి పోవల్సిందేనా?"* అంటూ ఆ దుష్ట సంప్రదాయాల నుండి విముక్తిని కోరుతాడు కవి.

తల్లి త్యాగం గురించి తన బిడ్డకోసం ఎదుర్కొనే ప్రమాదాల గురించి కత్తి పద్మారావు "అవర్ణం" కవితలో-

*"ట్రంకు రోడ్డు మీద*
*తారు పోసినప్పుడు*
*కాలిన తారులో*
*కాలు పెట్టిన నన్ను*
*చెప్పులు లేకుండా లేవనెత్తిన*
*నా తల్లి కేకే నా గుండె నాదం"* అని వర్ణిస్తాడు. తాము పనిచేసే చోట్లకు పిల్లల్ని వెంటబెట్టుకు పోవటం తప్ప, మరో సౌకర్యాలు లేని దళిత తల్లుల శ్రమ జీవితాన్ని ఆ కవిత స్పష్టం చేస్తుంది. తన తల్లి కష్టాల జీవితం నుంచి బయటపడి అందరి తల్లులాగే బతకటాన్ని కలగంటాడు వి.ఆర్.దార్ల. తన "కల అదృశ్యం కాకుండా..."లో -

*"మాడ్చుకుని తిన్న ఆకలి*
*మా అమ్మ పాదల మీద పడి*
*ఏడుస్తుంటుంది.*

*మా యమ్మే స్వయంగా ఉత్తరం రాస్తుంది*
*స్వయంగానే ఉత్తరం చదువుతుంది."*

అనేది అమ్మ గురించి కవి కనే అందమైన కల. అంతేకాదు-

*"మా యమ్మ కూడా*
*పట్టుచీర కట్టుకొని*
*పేరంటానికి వెళుతుంది*
*అధికారికంగానే పుణ్యక్షేత్రాల్ని సందర్శిస్తుంది."*

అంటూ ఇన్నాళ్ళూ తన తల్లికి అందుబాటులో లేని అవకాశాలు ఆమెకు దక్కాలని ఆశిస్తాడు. హఠాత్తుగా కలలోంచి మెలకువ వచ్చి, వాస్తవం అర్థమయ్యాక-

"దృశ్యాల్ని శాసించే నియంతనైతే ఎంత బావుణ్ణు" అని నిట్టూర్పు విడుస్తాడు.

"అమ్మ" వేదనాభరిత జీవితం గురించి ఎందరో దళిత కవులు రచనలు చేస్తున్నారు. ఈ కవితలు దళిత ఉద్యమం, సాహిత్యం దళిత స్త్రీని కేంద్ర బిందువుగా చేసుకోవాల్సిన అవసరాన్ని చెప్తూ, దళిత కవులకు స్త్రీవాద దృక్పథాన్నిస్తున్నాయి.

( చూపు ద్వైమాస పత్రికలో సెప్టెంబరు- అక్టోబరు 1996న ప్రచురితం)



# అద్భుతమైన "అంకమ్మ కథలు"

ప్రపంచంలో ఎన్నో మార్పులు సంభవిస్తున్నాయి. అయినా భిన్న మార్గాల్లో జీవనం కొనసాగుతుంది. ఒక వైపు సనాతన సంప్రదాయాలూ విశ్వాసాలూ, మరొక వైపు హేతువాద దృక్కోణంతోనూ జీవనం కొనసాగుతునే ఉంది. ప్రజలు రెండింటిలోనూ జీవనాన్ని కొనసాగిస్తున్నారు. ఎవరికి అనుకూలమైన దాన్ని వాళ్లు కోరుకుంటున్నారు. సమాజం వివిధ అంతరాలతో గోడల్ని కలిగే ఉంటుంది. కానీ, స్థూల దృష్టికి అడ్డులేనట్లే కనిపిస్తుంటుంది.

ఒక ప్రక్క శాస్త్రీయదృష్టి, మరొక ప్రక్క హేతువాద దృక్పథం వేగంగానే అభివృద్ధి చెందుతున్నప్పటికీ నేటికీ కొన్ని పట్టణాల్లోనూ, పల్లెటూళ్లలోనూ దేవుడూ, దెయ్యం, దేవతలు, పిశాచాలూ, పూజలు, మంత్రాలు, జాతరలు చేస్తూనే ఉంటున్నారు. చాలా చోట్ల తమ వంశానికో, తెగకో చెందిన వాళ్ల (వాటి)ని కూడా కుల దేవతలుగా పూజించుకొనే ఆచారం కొనసాగుతూనే ఉంది. కాకతీయుల్లో "కాకతి' అనే కుల దేవతను పూజించినట్లు చరిత్రలే సాక్ష్యాలు చెబుతున్నాయి. చాలా ఆడంబరంగా జరిగే సమ్మక్క సారక్క జాతర, బతకమ్మ పండుగ, బోనాల పండగ వంటివి కూడా కులదేవతల్లో భాగమే! జానపద సాహిత్యంలో కుల దేవతల అధ్యయనం చాలా ఆసక్తిదాయకంగా సాగుతుంది.

జానపదసాహిత్యంలో విశేషమైన కృషి చేసిన ఆచార్య బిరుదురాజు రామరాజు, ఆచార్య నాయని కృష్ణ కుమారి, ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (కృష్ణశ్రీ), డా// ఆర్వీ.ఎస్. సుందరం మొదలైన వారెందరో కులదేవతా పద్ధతి గురించి ఎంతో పరిశోధించారు. ఆ పరిశోధనను గమనిస్తే పంబల వాళ్లు, కొమ్ముల వాళ్లు, పిచ్చక కుంటలు, శారదకాండ్రు, వృత్తి గాయకులు ఎంతో కాలంగా వాటిని కాపాడుతూ వస్తున్నారని తెలుస్తుంది.

మన ప్రాచీన సాహిత్యంలో కూడా అటువంటి కథలు చాలా ఉన్నాయి. వాటిని సామాన్య ప్రజలు అత్యధికంగానే ఆదరిస్తున్నారు. వీరి లాగే చదువుకున్న వారు కూడా ప్రాధాన్యతనివ్వడం ప్రజల్లో జానపదత్వం ఎలా కలగలిసి పోయి ఉందో గమనించడానికి అనేక అవకాశాలు ఉన్నాయి. అలాగే వాళ్ళు జన జీవనంతో విడదీయరాని అనుబంధాన్ని ఏర్పరుచుకున్న జానపద కథలకు కూడా అంతే ప్రాధాన్యం ఉంది.

రాయలసీమలో "అద్భుతం'గా పంబలవాళ్లు, కొమ్ములవాళ్లు పాడుతుంటే ప్రజలు తండోప తండాలుగా ఆలకిస్తున్నా, అవన్నీ మౌఖిక రూపంలోనే ఉండిపోతున్నాయి. వాటిని గమనించిన ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు గారు వాటిలో కొన్నింటిన లిఖిత రూపంలో పెట్టారు. తన పరిశోధనను కథా గేయాన్ని "అంకమ్మ కథలు' అనే పేరుతో ఒక గ్రంథంగా ప్రచురించారు. దీనిలో మాసారపు వారి అంకమ్మ కథ, రవిద్దేవిరాజ కథ, కళ్యాణపు గంగురాజు కథ అని మూడు కథల్ని ఒక ప్రధాన గ్రంథంగా ప్రచురించారు. రచయిత ఈ కథల్లో కొన్ని చారిత్రక విషయాల్ని బయటపెట్టటానికి ప్రయత్నించారు.

1. “పల్నాటివారు కొమ్మరాజాదులను' మహారాజులవారు అని పిలిచే వారు. ఈ మహా రాజులను శబ్దమే మా రాజుల వారు, మారాసపు వారుగా మారి ఉంటుందని రచయిత నిరూపించారు.

2. అంకమ్మను కొలిచిన రాజులను పశ్చిమ చాళుక్యులనీ, వీరి రాజధాని కళ్యాణ నగరమనీ వీరినే కల్యాణ చాళుక్యులనీ పిలుస్తారని కూడా పేర్కొన్నారు.



3. కథా విషయానికొస్తే కులదేవతల్లో ఉండే విషయాలే వీటిలోనూ ఉన్నాయి. తనను పూజించని వాళ్లని కష్టాలు పెట్టడం, కొలిచేవాళ్లని రక్షించటం ప్రధాన ఇతివృత్తం. స్త్రీ దేవత అంకాళ శక్తిని పూజించటానికి ఇష్టపడని దేవగిరి పట్టణాన్ని పాలించే దేవాది రుద్రుడు. అతని మనవులకు ఎన్నో మహిమలు, మాయలు చేసి తన శక్తిని చూపిస్తాడు. అంతేకాక కొంత మందికి వరాలివ్వటం కూడా దీనిలో ప్రధాన కథా వస్తువుగా కనిపిస్తుంది. జానపదుల ఆచారాలు సంప్రదాయాలు, విశ్వాసాలు సాహస ప్రవృత్తులు దీనిలో అనేకం కనిపిస్తున్నాయి.

ఈ పుస్తకంలో భాష, పలుకుబడి అలంకార వైచిత్రిని చూస్తే, నిరక్షరాస్యులైన కొమ్ములవాళ్లు, పంబలవాళ్లకి ఉన్న ధారణశక్తి దానితో పాటు వాళ్ళు లయను పాటించిన విధానం పండితులకు సైతం ఆశ్చర్యాన్ని గొలుపుతుంది. రచయిత కూడా ప్రాచీనులు పాటించే మంగళంతో ప్రారంభించటం (గణనాయక ప్రార్ధన), మంగళంతో ముగించటం, (త్రిమూర్తులు సతీసమేతంగా దిగిరావటం) వంటి నియమాల్ని పాటించారు. జానప కళాకారులు, ప్రాచీన సంప్రదాయాలను చాలా వరకూ తెలిసో తెలియకో పాటిస్తుంటారనేవిషయాన్నిదీని ద్వారా నిరూపించారు.

(ఆంధ్రభూమి సాహితిలో 08-09-1997న ప్రచురితం)

# కథాశిల్పంలో నూతన విప్లవం
# “మాదిగోడు కథలు”

మాదిగ’ అనే పదం, మా ఆత్మగౌరవం కూడా దిగువ స్థాయిది కాదని గమనించమని దండోరా వేయటానికి నేడు నినాదంగా మారింది. నిజానికి మాదిగలు తెచ్చిన చైతన్యం అణచివేతకు గురవుతున్న మిగిలిన అన్ని కులాల్లోనూ ఇప్పుడిప్పుడే బాగా వ్యాపిస్తున్నది. చైతన్యం అనేది అన్ని కోణాల నుండీ, అన్ని రంగాల నుండీ జరగవలసి ఉంది. దానికి ఎన్నో ప్రేరణ శక్తులు బలాన్ని చేకూరుస్తుంటాయి. వాటన్నింటిని సమీకరించుకొని, సరైన బాటలో పయనించేటట్లు చేయగలిగినప్పుడే సామాజిక ఉద్యమాలు ఆశించిన ఫలితాలను పొందగలగటంలో వేగవంతంగా విజయవంతమవుతాయి. ఈ లక్ష్యాలను చేరుకోవడానికి మాదిగ సాహితీ వేత్తలు ప్రయత్నించడంలో భాగమే ‘మాదిగోడు’ కథల సంపుటి!

తరాలు మారేసరికి ఒకతరం సమాధుల్లో మరొక తరం చరిత్ర మరుగున పడిపోతుంటుంది. దానితో పాటు వాళ్ల నిజ జీవితం కూడా అడుగునపడి, పరాయీకరణకు కృత్రిమత్వానికి దారి తీస్తుంటుంది. నిజ జీవితం నిలబడాలంటే ఎన్ని తరాలైనా వాటిని కథలు కథలుగా చెప్పకోవటం వల్లనే అది నిలుస్తుంది. నాగప్పగారి సుందర్ రాజు కొన్ని నిజ జీవితాలను కథలుగా అందిస్తూ ఆ ప్రయత్నమే చేస్తున్నాడనిపించింది.



ఈ కథా సంపుటిలో మొదటి ‘బోడెద్దుకత’ లో దళితేతరులు తాము ఏది చేస్తే అది ‘కథ’గా, సాహిత్యంగా చలామణీ అయ్యిందనీ, అటువంటపుడు మాదిగల అలవాట్లు, ఆచారాలు, జీవిత వాస్తవాలన్నీ కూడా కథా వస్తువులుగా తీసుకోవటంలో తప్పలేదనీ, పైగా దాన్ని ఆత్మగౌరవ ప్రకటన, అస్తిత్వానికై జరిగే సంఘర్షణలో ఇవన్నీ భాగమేననే ధ్వనింపజేశాడు రచయిత. ఈ కథలో ఎద్దుని కోసి చూపటంలోనే రాబోయే కథలన్నింటికీ బీజాన్ని నాటి తర్వాత వచ్చే ఇంచుమించు అన్ని కథల్లోనూ మాదిగల జీవితాల్ని విశదీకరించి చూపాడు. ఇదొక గొప్ప శిల్పం. మాదిగలు అత్యంత ప్రియంగా గొడ్డును కోసుకొనే, పంచుకొనే దృశ్యాల్ని రమణీయంగా తన కలం కుంచెతో చిత్రీకరించిన నేర్పు తెలుగు సాహిత్యంలో సుందర్ రాజుకే దక్కుతుందేమో! గతంలో ఒకటి రెండు కథలు ఈ వస్తువుతో వచ్చినా ఇంత దృశ్య చిత్రీకరణ జరగలేదు!

ఈ కథల సంపుటిలో ‘జోరేసావు కత’, ‘ఈరారెడ్డి మనమురాలి మింద మొనుసుండాది’లలో అంటరాని పిల్లలు చదువుకోవటానికి మానసికంగా, శారీరకంగా ఎన్ని చిత్ర వధలకు గురికావల్సి వస్తుందో చాలా వరకూ మనో విశ్లేషణ పద్ధతిలో చూపాడు రచయిత.

ఊరి బావిలో ఉమ్మిమ్మేయటం, బావిలో తన నీడను చూసుకొని ఆనందించటం, తరగతి గదిలో అగ్రవర్ణాల వారి పిల్లలకు కాళ్లు తగిలించటం, తన గురించి ఊరిలో అందరూ చెప్పకుంటుంటే గౌరవంగా ఫీలవ్వటం వంటి చర్యలు కనిపిస్తాయి. ఇవన్నీ దళిత బాలుడికి మానసికంగా కలిగిన గాయాలకు కొంత ఉపశమనం కల్గించు కోవటానికి చేసిన పనులని అర్థం చేసుకోవాలి. తీరని కోరికలను ఆ విధంగానైనా తీర్చుకొని సంతృప్తి చెందడానికే అంటరాని పిల్లవాడు ఆ ప్రయత్నాలు చేశాడనిపిస్తుంది. నేటికీ దళితులు తమకు నచ్చిన అంశం మీద పరిశోధన చేయాలంటే విశ్వ విద్యాలయ సామ్రాజాల్లో సూపర్‌వైజర్ ‘రాజ్యా’ధిపత్యం నుండి ఎంతో హెరాస్‌మెంట్‌ని భరించవలసి వస్తుందని ఈ వ్యాస రచయితకు ఎదురైన స్వీయానుభవమే నిదర్శనం! ఇలాంటి పరిస్థితుల్లో ప్రాథమిక స్థాయిలో దళిత పిల్లలు ఇటువంటి అవమానకరమైన సంఘటనలకు ఎంతో క్రుంగిపోవాల్సి వస్తుందో కదా! అనేది ఈ కథ వల్ల స్పష్టమవుతుంది.

ఈరారెడ్డి ‘మనముురాలి మింద మొను సుండాది’లో ప్రాథమిక పాఠశాల స్థాయిలో ఏ అడ్డుగోడలు బందించలేని స్వేచ్ఛను, నిష్కళంక ప్రేమను పిల్లలు అనుభవించే ఆహ్లాదకర వాతావరణాన్నీ, కలిసి మెలిసి ఆడుకుంటూ, పాడుకుంటూ ఉండగా కలిగే ఆకర్షణ, ఉత్సాహాలను అత్యంత సహజంగా సుదరంగా చెప్పాడు. అంతటితో ఆగిపోతే విశేషం ఏమీలేదనుకోవచ్చు. ఆ విధమైన పరిస్థితి కొనసాగితే సామాజిక అంతరువులు వ్యత్యాసాలు తొలిగిపోతాయి. కాబట్టే పిల్లల్లో కూడా కుల మత వర్గ విభేదాలు సృష్టిస్తున్న సంకుచిత పెద్దలను దుయ్యబెడ్తున్నాడు. కాన్వెంటు విద్యా విధానం వచ్చి ఈ పసి పిల్లలు ఆడుకొనే పూల తోటల్లో బ్రహ్మజెముళ్లను నాటే వ్యవస్థను ప్రతిఘటిస్తున్నాడు. అందిన అవకాశాలతోనే దళిత పిల్లలు ప్రదర్శించే ప్రతిభను గుర్తించవలసిన అవసరాన్ని కూడా ప్రబోధించే కథగా దీన్ని అభివర్ణించవచ్చు. దానితోపాటు ఆగస్టు పదిహేను నాడు జాతీయ పతాకాన్ని ఎగురవేసి కులం - మతం లేదంటూ, సమైక్యతా గీతాలతో పాటు గాంధీ, నెహ్రూలను కీర్తిస్తూ, దానికి దళిత పిల్లలనే సాధనంగా వాడుకోవటం గురించి రచయిత వర్ణిస్తూ... చక్కని అధిక్షేపక ధోరణిలో రచన చేశాడు.

దళితులను వాళ్ళ కళ్ళను వాళ్ళ చేతనే ఎంత నాజూకుగా పొడిపించుకొనేలా చేస్తున్నారో, తేనె పూసిన కత్తులతో వాళ్ళ నాలుకలను వాళ్ళే ఎలా తెగ్గోసుకునేలా చేస్తున్నారో ఈ కథలో చెప్పాడు. కులం లేదంటూ పాట పాడినందుకు మెచ్చుకుంటూనే, పాడిన మాదిగ పిల్లలను అసహ్యించుకోవటం స్వర్ణోత్సవ భారతదేశ రాజకీయ, సామాజిక విలువల పతనాన్ని తెలియజేస్తుంది. నిజంగా కుల నిర్మూలన గురించి కృషి చేసిన డా// బి.ఆర్. అంబేద్కర్, డా// బాబూ జగజ్జీవన్ రామ్‌లకు సంబంధించిన గేయాల్ని స్వాతంత్ర్య వేడుకల్లో పాడించగలిగే చైతన్యం దళితుల్లో రావాలనేదే రచయిత తపన!

‘నడిమింటిబోడెక్కబసివిరాలయ్యేద’ కథ భయంకరమైన మూఢాచారాల నుండి ప్రజలకు విముక్తి లభించవల్సిన ఆవశ్యకతను గుర్తుచేస్తున్నది.



‘మద్దికెరమార్తమ్మ’ను అగ్రవర్ణ భూస్వాములు అత్యాచారం చేసి చంపేసిన ఆ వాస్తవ పరిస్థితిని కథ కంటే సంఘటనలను వర్ణించేటప్పుడు చదువుతున్నట్లే మొదట్లో అన్పించినా, మనకు తెలియకుండానే పిడికిళ్లు బిగుసుకోవటం ప్రారంభిస్తాయి. దళిత సంఘాలు ఉద్యమాలు కూడా అన్ని సంఘాలు మాదిరిగానే మారిపోకూడదనీ ప్రక్కదారి పడుతున్న దళిత ఉద్యమబాటని సరిచేసుకోమనే సునిశిత విమర్శతో కూడిన సూచన కూడా దీనిలో ఉంది. సమస్యల ప్రాధాన్య వివక్షతకు గుర్తించవలసిన అవసరాన్ని మరింత స్పష్టం చేస్తున్నది.

ఈ కథా సంపుటిలో మరో విశేషమేమిటంటే అందరిలాగానే దళితులూ పేర్లు పెట్టుకున్నప్పటికీ, వాటికి బదులు కులం (మాదిగ రంగన్న కొడుకు, ఈడిగ రంగయ్య), మతం (తురకోడు ఖాజా), గుణం (సెలివోడు - సొట్టకాళ్ల సద్గుణం), వంశాల (సాలంజోళ్లు) చరిత్రల ప్రాధాన్యతను బట్టే పేర్లు మార్పు చెంది, అవే స్థిరపడి పోతుంటాయనే నగ్న సత్యాన్ని చరిత్రీకరించాడు.

దళితులకు కూడా స్వంత ఆలోచనలు ఉంటాయి. స్వంత జీవితం జీవించాలని ఉంటుంది. ఆత్మ గౌరవంతో బతకాలని ఉంటుంది. కానీ, బలవంతంగా మోపబడిన వాటి నుండి తప్పించుకోలేక, వాటితోనే జీవితాల్ని లాక్కొని రావల్సివస్తుందని, తమవి కాని జీవితాల్లో దళితులు జీవిస్తున్నారనేది వాచ్యం చేయకుండా శిల్పనైపుణ్యంతో దాన్ని అందించగలిగాడు రచయిత.

ఈ కథా రచయిత దళిత విద్యార్థి జీవిత చిత్రణ దిశగా పయనిస్తే మంచి జీవం ఉన్న మరిన్ని కథలను అందించగలుగుతాడని అనిపిస్తుంది. ఈ కథలు రాయలసీమ మాండలికంలో ఉన్నాయా? రాయలసీమలోని దళితుల భాషను కథల్లో రాశాడా? అనేది గమనించి మాత్రమే కథల్లోని మాండలిక భాషా నిర్ణయం చేయటం మంచిది. కనుక, అది భాషావేత్తలకు వదిలేస్తున్నాను.

రచయితలు కథల్లో సాధారణంగా పేర్లను మార్పులు చేస్తుంటారు. కానీ, సుందర్‌రాజు చాలా కథల్లో కొంతమంది నాయకుల పేర్లు యథాతథంగానే ఉంచేశాడు. తీసుకొన్న కథా వస్తువులు కూడా వాస్తవాలే.

సమాజంలో కొన్ని రుగ్మతలు ఉంటాయి. వాటిని యధాతథంగా చెప్పటం వాస్తవిక రచన అనిపించుకోదు. ఆ పరిస్థితులు ఉత్పన్నం కావటానికి దారితీసిన కారణాలు ఏమిటి? దానికి రచయిత ఇచ్చే పరిష్కారమేమిటి? అనేది తన సృజనాత్మక శక్తితో పాఠకునికి స్ఫురించగలిగేటట్లు చేయగలిగేది వాస్తవిక రచన అనిపించుకొంటుంది.. రచయితలో ఆ ప్రతిభ ఉన్నప్పుడే ప్రజల్లో భావాత్మక చైతన్యం కలిగి, అది క్రియాత్మక చైతన్యానికి దారి తీస్తుంది. కొన్ని కథల్లో సుందర్‌రాజు ఈ లక్షణాన్ని అనుసరించాడు. కొన్నింటిని పాఠకులకే వదిలేశాడు. ఈ శిల్ప పద్ధతి పాఠకుల ఆలోచనలకు పదును పెట్టటానికైతే పర్వాలేదు. కాని అసమర్ధత అయితే రచయిత మాత్రం పలాయనవాదమే అవుతుంది. ఏది ఏమైనా దళిత కథా రచయితల్లో సుందర్‌రాజు ఒక నూతన విప్లవాన్ని తెచ్చిన వానిగా మిగిలిపోతాడనే సత్యాన్ని 'మాదిగోడు' విన్పిస్తుంది.

(మాదిగోడు కథల సంపుటికి 26-10-1997 న రాసిన ముందుమాటను కొన్ని మార్పులు, చేర్పులతో ప్రచురిస్తున్నాను)



# దళిత ఉద్యమానికి చైతన్య గీతిక "వర్గీకరణీయం"

*"అగ్రవర్ణాల మీద*
*ఉగ్రవాదుల్లా విరుచుకుపడ్డారు కదా*
*'డాష్‌లో తంతామని'*
*రాష్‌గా రాశారు కదా*
*మా దగ్గరెందుకు*
*ముడుచుకుపోయారు"* అని దళితకవుల్ని నిలదీసి అడుగుతూ, ఉపకుల విభజన జరిగినప్పుడు లబ్ధి పొంది, దాన్ని సుప్రీంకోర్టు నిలుపుదల చేయడంతో, ఆ లబ్ధిదారుల ఆందోళన, ఆవేదనల అక్షరరూపం ఎండ్లూరి సుధాకర్ 'వర్గీకరణీయం'లో వ్యక్తమైన కవితా ఖండిక అది. 'వర్గీకరణీయం' దళిత కవుల్లోని నిబద్ధతను, ఆచరణను ప్రశ్నిస్తుంది.

రాష్ట్రంలో ఎస్.సి.ల మధ్య తమకి రావాల్సిన హక్కుల్ని పొందడంలో కొన్నేళ్లుగా ఉద్యమాలు జరుగుతూనే ఉన్నాయి. రాజ్యాంగం ప్రకారం ఎస్.సి.లను విభజించకూడదని, దళితుల ఐక్యత చెడగొట్టకూడదని, అందుచేత దళిత సమైక్యత అవసరమంటూ ఒక వర్గం, 'ఐక్యత'కేమీ నష్టం

రాకుండా రావాల్సిన రాయితీలను కుటుంబంలో సభ్యుల మాదిరి పంచుకోవాలని మరొక వర్గం వివిధ ఉద్యమాలు చేస్తూనే ఉంది.

అసలు రిజర్వేషన్లు భారత సమైక్యతకు గొడ్డలి పెట్టని, కాబట్టి వాటిని వ్యతిరేకించే వర్గమూ ఉంది. ఈ వర్గాన్ని వ్యతిరేకిస్తూ 'సమైక్యదళితులు'గా చాలా తీవ్ర పదజాలంతో కవులు కవిత్వాన్ని రాశారు. దీనికి వ్యతిరేకంగా కొందరు తమ ఆవేదనల్ని అక్షరీకరిస్తూ చకోనా సంపాదకత్వంలో 'పాట చిక్కబడుతుందా?' అనే కవితా సంకలనాన్ని కూడా ప్రచురించుకోవాల్సి వచ్చింది! తర్వాత (ఈ విషయంలో) చాలా చర్చలు జరిగాయి. అంత తీవ్ర పదజాలంతో, తమ హక్కుల కోసం, ఆత్మ గౌరవం కోసం రాసిన దళిత ఉమ్మడి కవులు వర్గీకరణను సమర్థిస్తూ గానీ వ్యతిరేకిస్తూ గానీ ఏదో ఒక అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పకుండా 'ప్రముఖ దళితకవులు' మౌనంగా ఉండడాన్ని ప్రశ్నిస్తున్నాడు కవి.

రాష్ట్ర అసెంబ్లీ ఏకగ్రీవంగా ఇప్పటికే రెండు సార్లు వర్గీకరణను సమర్థిస్తూ తీర్మానాలు చేసింది. అంటే దళితుల్లో ఒక వర్గానికి 'న్యాయం' జరడం లేదని, దాన్ని సరిదిద్దుకోవాల్సిన అవసరం ఉందని స్పష్టంగా తెలుస్తుంది. వర్గీకరణ చేసిన తర్వాత విద్య, ఉద్యోగ రంగాలలో ఎన్నో ఆవకాశాల్ని అన్ని వర్గాల (ఎస్.సి.లలోని) వారు పొందడం, సుప్రీంకోర్టు తీర్పుతో ఎప్పుడేమవుతుందోననే ఆందోళనతో ఉండడాన్ని కవి –

*"అరుంధతీ సుతుల కళ్లలో*
*కన్నీటి కాటుక రేఖలు*
*రెప్పల కింద చెప్పుల మేకులు*
*గుండెలన్నీ*
*గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకున్నా యి*
*ఉద్యోగాలు ఏమవుతాయోనని*
*ఉద్వేగాలు పెరిగిపోతున్నా యి.*
*ఎవరిని కదిలించినా దిగులు మబ్బుల జల్లులు*
*ప్రతి ఇల్లూ ఒక ఎమర్జెన్సీలా ఉంది...*
*కన్నీళ్లు మింగి మింగి*



*కడుపు నిండిపోయింది.....''* ఇలా వర్గీకరణ వల్ల లబ్ధి పొందిన వారి జీవితాల్తో మమేకమై, వారి ఆవేదనను ఆత్మీకరించుకున్నారు. నిజానికిది అక్షరాలుగా రాయలేకపోయినా తమ అభిప్రాయంగా చెప్పలేకపోయినా వర్గీకరణ ప్రయోజనం పొందిన ప్రతి ఒక్కరిదీ! 'వర్గీకరణ ప్రయోజనం' అనడంలో మాల, మాదిగ, రెల్లి అన్ని ఉపకులాలూ ఉన్నాయి. వర్గీకరణ రద్దయితే ఎబిసిడిల విభజన ప్రకారం జరిగిన అన్ని ఉద్యోగాల భర్తీ ఆగిపోయి, కొత్త భర్తీ జరిగితే ఆ బాధ అనుభవించడంలో 'మాల - మాదిగ' అనే తేడా ఉండదు. ఎందుచేతనంటే ఇంతకు ముందు వచ్చినవాళ్లకే సీట్లయినా, ఉద్యోగాలైనా మళ్లీ వస్తాయనే గ్యారంటీ లేదు.

'సమైక్యత' గురించి మాట్లాడుకొనేటప్పుడు భిన్న జాతుల వస్తు ప్రదర్శనశాలగా పిలువబడుతున్న భారతదేశంలో కులాలు, మతాలు, ప్రాంతాలు, భిన్న సంస్కృతులూ ఉన్నా అవసరమైనప్పుడు సమైక్యంగానే భారతీయులు సమాధానం చెప్తున్నారు. అలాగే బి.సి.లు వెనుకబడిన తరగతులు వివిధ గ్రూపులుగా విభజన జరిగి తమకు రావాల్సిన రాయితీలను పొందుతున్నారు. ఇలా చేయడం వల్ల వీరిలో వీరి సమైక్యతకు నష్టం వాటిల్లిందా? అలాగే ఎస్.సి.లు కూడా! ఎస్.సి.లలో విభజన జరిగినంత మాత్రాన సమైక్యతకు నష్టం జరగదు.

వర్గీకరణ కోసం ఉద్యమాలు జరిగినా, అవి సాధించుకున్న తర్వాత, సామాజిక ఉద్యమాలు కలిసి చేయాలనేది ఆ ఉద్యమనేతలే కార్యరూపాన్ని కూడా సూచించారు. ఉత్తర భారతదేశంలో కూడా ఎస్.సి.ల్లో ఒక వర్గమే అన్నింటినీ అనుభవిస్తుందని, అలాగే దక్షిణ భారతదేశంలో కూడా ఒక వర్గమే ప్రధానంగా హక్కుల్ని పొందుతున్నాయనే వాదనలు కూడా బలంగానే ఉన్నాయి. అసలు రిజర్వేషన్లు అనేవి దీర్ఘకాలికంగా కాకుండా కొన్ని సామాజిక అసమానతలు తొలగిపోయేంత వరకూ మాత్రమే అమలు చేయవలసిన అవసరం ఉంది. లేకపోతే కుల నిర్మూలన జరగకపోగా, కులం మరింత పాతుకొని పోతుంది. దీని సాధించడానికి అవసరమైతే ఎస్.సి.ల్లోనూ క్రీమీలేయర్ పెట్టాలి.

అగ్రవర్ణాలని పిలువబడుతున్న వారిలోనూ ఆర్థికంగా అణచివేయబడిన వారికి కొంత కాలం కొంత శాతం రిజర్వేషన్లు కల్పించాలి. హక్కుల్ని పొందడంలో అందరూ సమానులే అనేది నినదించాలి. ఈ భావాలను కొన్నింటిని కవిత్వ రూపంలో 'వర్గీకరణీయం'గా వర్ణించడంలో చక్కని వ్యంగ్యాన్ని అనుసరించారు కవి. శిల్ప దృష్ట్యా కూడా చాలా లోతుగా విశ్లేషణ చేయాల్సిన కావ్యం. వక్రోక్తి, ధ్వని చమత్కారం వంటివి కావ్యం నిండా ఉన్నాయి. శ్రీశ్రీ కవిత్వ ప్రవాహం, అక్కడక్కడా కనిపిస్తుంది. సమకాలీన దళిత సాహిత్యాన్ని రికార్డు చేయడంలో కొత్త గబ్బిల తర్వాత ఈ కవిది ఇది రెండవదైనా, సాహిత్యంలో మాత్రం ఎస్.సి. వర్గీకరణను సమర్థించిన తొలి దీర్ఘకావ్యంగా నిలుస్తుంది.

( వర్గీకరణీయం (దళిత దీర్ఘకవి); కవి: ఎండ్లూరి సుధాకర్; వెల: ఇరవై రూపాయలు; ప్రతులకు: ఎండ్లూరి సుధాకర్, అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి)

(http://.thatstelugu.oneindia.inలో 2- 04- 2005 న ప్రచురితం)



# దళిత స్త్రీ అనుభవాలకు కళాత్మక అభివ్యక్తి

ఆకలికి తట్టుకోలేక మట్టినే తిని ప్రాణం కాపాడుకోవాలనుకున్న ఒక నిరుపేద పిల్ల, జీవితాన్ని చిత్రించిన కథ 'మన్నుబువ్వ' పేరుతో జాజుల గౌరి ఒక కథల సంపుటిని ప్రకటించారు. ఈ సంపుటిలోని ప్రతి కథా పాఠకుల హృదయాన్ని ద్రవించే శైలిలో, తెలంగాణా సజీవ భాషలో రాశారు. "సెట్టు కింద సల్లగుంది గానీ నా కడుపులో మంటగుంది" అని రాయడంలో కథకి ఉండాల్సిన వాతావరణ చిత్రణ, కథకెలా ఉపయోగించుకున్నారో అర్థమవుతుంది. ఆకలికి తట్టుకోలేక, నీళ్లు తాగినా ఆకలి తీరక, ఇంటి ముందరున్న చెట్టు కింద కూర్చున్న పిల్ల, ఆకలి తీరే దాకా మట్టినే తినడంతో కథ ముగుస్తుంది.

ఉత్తమ పురుషలో కథని నడిపించినప్పుడు, ఇటువంటి కథను ముగించడం కష్టంతో కూడిన పని. దాన్ని రచయిత్రి చక్కని నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ "నేను బోయేతాలకల్ల అవ్వ బువ్వొండి ఎసరు వంపుతోంది. అన్న, సెల్లె అవ్వ సుట్టూ కూకుని బువ్వెప్పుడైతదా అని జూస్తుండ్రు, గానీ నేను కుండ కాడ్కి బోయి సెంబు నిండా నీళ్లు దీస్కుని గట్ట గట్ట తాగి, అవ్వ దిక్కు పోయి, మీదున్న డేగీస దిక్కు జూస్కుంట కిందనే పండుకున్నా. అప్పటి దాకా బువ్వడిగి గట్ల పండుకున్న, నా దిక్కు అవ్వ, అన్నా సెల్లి సిత్రంగా జూస్తుండ్రు.

నాకు ఆ తరువాత ఏమైందో ఏమో! ఇగ లేసి తింటది, అగ లేసి తింటదని ఎదిరిస్తూనే ఉంటరు గావచ్చు" అని ముగించారు. కథలో ఆ బాలిక చనిపోతుంది. మరణించిన తర్వాత పాత్ర ఎలా మాట్లాడుతుందని అనిపిస్తుంది. అందుకనే పడుకునే వరకూ ఉన్న స్థితి తర్వాత " ఏమైందో ఏమో!" అని అనడం చక్కని మెరుపును సూచిస్తుంది. ఈ ఒక్క కథ చాలు, జాజుల గౌరి కథల్లో ప్రదర్శించిన కథాకథన శిల్పాన్నిగమనించడానికి.ఈ సంపుటిలో 25 కథలున్నాయి. చాలా కథలు ముందుగా వివిధ పత్రికల్లో ప్రచురితమైనవే.

ఈ కథల సంపుటికి సుశీలా నారాయణ రెడ్డి స్మారక ట్రస్టుతో పాటు, ఆర్థిక సహాయం, పోట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయం కూడా అందింది. *"ఇప్పటి దాకా రికార్డు కాని దళిత జీవిత కోణాలు, సంస్కృతి ఈ కథల్లో చూడవచ్చు"* అని అంటూ 'సాహిత్యంలో కొత్త నీరు' పేరుతో ప్రసిద్ధ రచయిత బి. ఎస్.రాములు ముందుమాట రాశారు. దీనిలో బి. ఎస్. రాములు ప్రతి కథనీ చక్కగా విశ్లేషించారు. ఒక చిన్న సిద్ధాంత గ్రంథాన్నే రాశారనిపిస్తుంది. ఇది బి.ఎస్. రాములు గారి ప్రోత్సాహక సహృదయతకు నిదర్శనం!

కథా సంపుటిలోని పట్టాలు' కథ ఇళ్ల స్థలాల పేరిట జరిగే రాజకీయాల్ని, 'నీళ్లబాయి'లో స్త్రీపురుష వివక్షనీ, 'సూరీడు' కథలో దళితుల్లో రావాల్సిన చైతన్యాన్ని చక్కగా చిత్రించారు. రచయిత్ర తన ఆత్మకథగా చెప్పుకున్న 'నేన్ నేన్ లెక్కనే'లో ఆత్మగౌరవాభివ్యక్తి ఉంది. కథలన్నింటిలోనూ కన్పించే రచయిత్రి ఆవేదన అట్టడుగు స్థాయి జీవన వేదనలు, దళిత ఉద్యమాలు, దళితులపై జరిగే దాడులు (అవి అనేక రూపాల్లో ఉండవచ్చు) వాటన్నింటి గురించి ఆలోచింపజేయాలనేదే లక్ష్యం కావచ్చు!

'నా పయనం' పేరుతో రచయిత్రి రాసుకున్న ప్రస్తావన ఆత్మీయంగా ఉంది. తనకు సహాయం చేసిన వారిని మరిచిపోలేని కృతజ్ఞత కనిపిస్తుంది. కేవలం మాటలుగా కాకుండా ప్రతి దానికీ కార్యకారణాన్ని చూపారు. అలా ఆమె రచయిత్రి కావడానికి కేవలం దళితులే కాకుండా, దళిత స్పృహ ఉన్న వారెంతో మంది సహకరించినట్లు తెలుస్తుంది.



ప్రతి రోజు ఏదో ఒక పత్రికలో 'కథలు' వస్తున్నా, దళిత స్త్రీ, అదీ తెలంగాణా దళిత స్త్రీ జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ఈ ప్రాంతంలో ఉండే దళితుల ప్రత్యేక సమస్యల్ని అవగాహన చేసుకోవడానికి, కథలో ప్రవేశించవలసిన నేటివిటీ భాషకి ఎలా ఉంటే బాగుంటుందో గమనించడానికీ జాజుల గౌరి 'మన్నుబువ్వ' కథల సంపుటిని చదవడం చాలా అవసరం.

( మన్నుబువ్వ (కథల సంపుటి), రచయిత్రి: జాజుల గౌరి; ప్రతులకు: విశాల సామాజిక తాత్త్విక విశ్వవిద్యాలయం, రామకృష్ణ నగర్, అంబర్‌పేట, హైదరాబాద్)

(http://.thatstelugu.oneindia.inలో 08-04- 2005 న ప్రచురితం)

# దు:ఖమెప్పుడూ ఒంటరిది కాదన్న

# *“ఒంటరి దు:ఖం”*

దు:ఖించని మనిషే ఈ ప్రపంచంలో కనిపించడు. కానీ, బెల్లంకొండ రవికాంత్ 'ఒంటరి దు:ఖం' పేరుతో ఓ కవితా సంపుటిని ప్రకటించాడు.మరి ఈ పేరు పెట్టడంలో గల ఆంతర్యమేమిటి?దీనిలో ఉన్న 37 వితాఖండికల్లో దేన్ని స్పర్శించినా ఈ ప్రశ్నకు చక్కటి సమాధానం దొరుకుతుంది. మనుషుల మధ్యే జీవిస్తూ మనిషి ఒంటరితనానికి గురి కావడమంటే ఏమిటి? అది 'ఒంటరి దు:ఖమే' అవుతుందని ఈ కవితలు చదివితే తెలుస్తుంది.

మానవ సంబంధాలన్నీ ఆర్థిక, అధికారిక, యాంత్రిక సంబంధాలుగా మారిపోతున్నప్పుడు దు:ఖం కూడా ఒంటరిగానే భరించవలసి వస్తుంది. అందుకే ఈ కవితాసంపుటిలో ఒంటరిగా కనిపించే దు:ఖం అనేకమందిది! బతకడం ఒక పోరాటమైనప్పుడు ఉన్న ఊరు వదిలి పోవలసివచ్చినప్పుడు కనిపించేది ఒంటరి దు:ఖంలో కార్చేది అనేక మంది అశ్రువులే!

"అతడి సాంగత్యపు ఎక్కిళ్ల మధ్య డాలర్ల వాన బతుకును శాసిస్తుంటే సహచరుడి శ్వాస ఆమెకెప్పుడూ అందని ద్రాక్షే...!!" అనటంలో గానీ "ఎన్నెన్నో *వీడ్కోళ్లు, ఎన్నెన్నో కన్నీళ్లు చేత్తో తుడిచేసుకోలేని కోట్ల కొద్ది అనుభూతులు అతడికొరకు జీవిస్తూ నిరీక్షిస్తున్న గుర్తుగా ఆమె చెక్కిళ్లపై తడి ఆరని కన్నీటి*



*చారలు*" చూపడంలోనూ అనేకమంది ఎడబాటు వలన కలిగిన దు:ఖాన్ని వర్ణిస్తున్నాడు కవి. "*ఎగిరిపోయిన యంత్ర పక్షి నుండి రాలి పడిన కన్నీటి చుక్కలు దట్టంగా అలుముకున్న మేఘాలై నీ అనుభూతుల తాకిడికి అప్పుడప్పుడూ ఇక్కడ వర్షిస్తూనే ఉన్నా*" మని డాలర్ వంతెనపై మిణుకుమిణుకుమంటూ కలవరపడుతున్న ఒంటరి దీపం ఎప్పుడు ఏమవుతుందోనంటున్నాడు కవి.

ప్రపంచం సమాచారం రూపంలో దగ్గరికొచ్చిన, ఆత్మీయతలు కొరవడిన వైనాన్ని గుర్తించమంటూ "అనుబంధాలన్నీ ఇంగ్లీషులో నవ్వుకుంటున్నాయ్" అంటున్నాడు కవి. ప్రపంచీకరణ తెచ్చిన మానవసంబంధాలను ఆవిష్కరించడంలో కవి కృతకృత్యుడయ్యాడు.

కవికి సామాజిక స్పృహ ఉంది. కనుకనే సమాజంలో జరుగుతున్న అనేక సంఘటనలకు అక్షరమై ప్రతిస్పందించాడు. అమ్మ ఒడిలో ఆడుకోవలసిన బాల్యం "అవసరం కొద్దీ అన్యాయమై మొలకెత్తుతూ" కరిగిపోతున్న బాల్యం గురించీ "గది నిండా కబుర్ల సీతాకోక చిలుకలెగరేసి', 'కలల మేఘాల్ని రాలుస్తూ' కనిపించని క్షణంలోని 'పాప' నేహ కోసం " ఇల్లంతా ఎండిపోయిన చెరువులా ఉంద"ని దు:ఖించడంలో ఎంతో ఆర్ద్రత ఉంది.

బలవంతపు చావులను కూడా, అతి సహజమైన ఆత్మహత్యలుగా చిత్రించగలిగే మేధావులను పేర్కొంటూనే, అటువంటి వారిని నిరసిస్తూ "ఇక్కడ లేనితనం ఒకరికొకరిని ఏమీ కానీయనితనాన్ని" వెల్లడిస్తూనే, వెండి వెలుగుల తెలుగు పుష్పం... ప్రత్యూష లాంటివారి మరణం గురించీ స్పందిస్తాడు కవి.

కవితాసంపుటికి పెట్టిన పేరు 'ఒంటరి దు:ఖం'తో రాసింది మాత్రం స్పష్టంగా దళిత కవిత. డా|| బి.ఆర్. అంబేడ్కర్‌ని దళితులు, తమ చైతన్యానికి గొప్ప ప్రతీకగా భావిస్తారు. అందుకని దళితులను ప్రసన్నం చేసుకొని అధికారంలోకి రావాలనుకొనే అనేక వర్ణాల వారికి అంబేడ్కర్ జయంతి, వర్ధంతుల వేడుకలు గొప్ప మార్గాలను చూపిస్తుంటాయి. అధికారాన్ని నిలబెట్టుకోవడానికి దళితుల్లో కలిసిపోయే కొంతమంది

అధికారిక కుతంత్రాన్ని పసిగట్టిన కవి "*నా తాత చూపుడు వేలు ఇన్నాళ్లకు నిన్నిలా నా వాడల్లోకి రప్పించిందా...? సహపంక్తి భోజనాలతో నీ చిత్తరువు పత్రికల్లో పతాక శీర్షికల్లో అందంగానే ఉంది కుడి పక్కనే... ఒదిగి ఒదిగి విస్తర్లో కూర్చున్న అన్నం తరతరాల కాలం పీల్చి పిప్పి చేసిన నా కులంలా నా అమ్మ అలీసమ్మ కన్నీళ్లలా కారంచేడు డ్రైనేజీల్లో ప్రవహించిన నా అన్నల రక్తంలా*" ఉందనడంలో తరతరాల నుండీ దళితులను వంచిస్తున్న, హింసిస్తున్న, మోసగిస్తున్న చారిత్రక సామాజిక స్థితిగతులను వర్ణిస్తున్నాడీ కవి.

అంబేద్కర్ ని కవితలో 'చిత్తరువు'లా అని ప్రయోగించడంలో గొప్ప వ్యంగ్యం ఉంది. పత్రికల్లో ఫొటో కోసం పడే ఆరాటం. దాన్ని ఫొటో అనకుండా చిత్తరువు అనడంలో అగ్రవర్ణ చిత్తాన్ని (మనసుని) కూడా గ్రహించమంటున్నాడేమో కవి. ఇలాంటి పదాలను ఎన్నుకోవడంలోనే కవి ప్రతిభ వెల్లడవుతుంటుంది. ఇలాంటి సందర్భాలు చాలా కవితల్లో కనిపిస్తాయి. సమాజంలో ఒంటరిగా మిగిలిపోతున్న దళితుడి దు:ఖాన్ని ప్రధానంగా చెప్పాలనుకొని బహుశా ఈ కవితకి ' ఒంటరి దు:ఖం' అని పేరు పెట్టినా మానవ సంబంధాలకు దూరమై దు:ఖించే అనేక మంది గురించి వర్ణించిన కవితలన్నింటిలోనూ ఇది కనిపిస్తుంది. ఆ విధంగా 'దళిత ' శబ్దానికి ఉన్న విశాలత్వాన్ని వాదుకున్నాడు కవి.

ఈ కవితా సంపుటి నిండా బాల్యం, స్త్రీ ఆవేదన, స్త్రీపురుషుల ఎడబాటు, నిత్యం యంత్రాలతో గడుపుతున్నంత సమయం, మనుషులతో గడపలేని క్షణాలను , దేశభక్తిని, దేశభక్తి పేరుతో జరిగే వంచనని (అసందర్భ పోరాట దృశ్యం) రాజ్యహింసని, వైయక్తిక అనుభూతులను కవిత్వం చేయడంలో రవికాంత్ చాలా పరిణతి సాధించాడు. అయితే కవితా సంపుటి నిండా జ్ఞాపకం, కలలు, మేఘం వంటి పదాలు ఎక్కువగా కనిపిస్తున్నట్లు ఉంటాయి. కానీ పునరుక్తి అవుతున్నా ఎద్దగా చిరాకనిపించదు. నిత్యం పాఠాలుగా చెప్పుకునే కొన్ని పౌరాణిక పాత్రల పట్లా, పాఠశాలల్లో వర్ణించే 'ప్రతిజ్ఞ'లోని అంశాలు ఆచరణలోకి రాకపోయినా, దానికి వ్యతిరేకంగా జరగడం పట్లా కవికి ఆవేదన ఉంది. ఇలాంటి వాటి గురించి సంఘర్షించుకోవాలనే ఆరాటం ఉంది. అవసరమైతే పోరాటానికీ మద్దతు



పలుకుతాడు. ఆ పోరాటంలో మరణించినా ఆ మరణానికి సార్ధకత ఉందంటాడు.

"*పోరాటమే సంస్కృతిగా మారుతున్న చోట చిట్టి చేతులు కూడా ఆయుధాలనే దిద్దుకుంటాయి. ఇప్పుడు నూతన వసంతం రక్త రాగాలాపన చేస్తుంటే అమ్మలందరూ ఎ.కె. 47లనే ప్రసవించవలసి ఉంది*" అని ప్రకటించిన రవికాంత్‌ని, మరింత దళిత చైతన్యంతో ముందుకు రావాలని శిఖామణి ఆహ్వానించినా, ఒక స్పష్టమైన దృక్పథంతో ముందుకు వెళ్తున్నాడీ కవి అని తెలుస్తుంది. వస్తు, శిల్ప, రూప సమన్వయ వాదిగా కనిపిస్తాడు కవి.

తన దృక్పథంలో దళితుల అనుభవాలు కూడా ఒకటిగా చేసుకుంటాడేమో గానీ దళిత దృక్పథమే చాలదంటున్నట్లున్నాడు కవి.అతని దృక్పథమేదైనా, ఎవరూ ఒంటరితనంలో కుమిలిపోకూడదనేదే కవి ఆశయం!

( ఒంటరి దు:ఖం (కవితా సంకలనం); కవి : బెల్లంకొండ రవికాంత్; వెల: రూ. 50/-;
ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచులు)

(http://.thatstelugu.oneindia.in లో 29- 04- 2005 న ప్రచురితం)

# సలీం "వెండిమేఘం" నవల ముస్లిం స్త్రీల జీవిత చిత్రణ

ముస్లిం జీవితాల్లోనూ కనిపించని చీకటి కోణాలు అనేకం ఉన్నాయి. వాటిలో కొన్నింటిని ఇప్పటికే చాలామంది కవిత్వం రూపంలో బలంగానే అభివ్యక్తీకరించగలుగుతున్నారు. కేవలం కవిత్వంలోనే కాకుండా మిగిలిన ప్రక్రియల్లో కూడా ముస్లిం సాహిత్యం విస్తరిల్లుతున్నది. సలీం 'వెండి మేఘం' పేరుతో ఒక గొప్ప నవల రాశారు. ముస్లిం జీవితాలతో మమేకం కాలేకపోతున్న దూదేకుల జీవితాల్ని, ముస్లిం స్త్రీ స్థితిగతుల్ని చూపుతూ ఈ నవలను వర్ణించారు.

'అన్వర్' అనే స్త్రీ పాత్ర చుట్టూనే కథ నడిపించినా, బలమైన తాత్విక పునాదితో ముస్లిం స్త్రీవాదాన్ని అందించగలిగారు. ముస్లింలలో భాష, ఆచార సంప్రదాయాలు వంటి వాటిలో, వాటిని వినియోగించుకోవడంలో గల వ్యత్యాసాల వల్ల కింది కులాల నుండి ముస్లింలుగా మారిన వారు ప్రధాన ముస్లిం జీవన స్రవంతిలో కలవలేకపోవడమో, దూరం కావడమో జరుగుతుంది. దీన్ని రచయిత బలంగా పట్టుకోగలిగారు.

పెళ్ళి అంటే ఏమిటో తెలియని చిన్న వయసులోనే తనకంటే పాతికేళ్ళ పెద్దవాడి రెండవ భార్యగా మారిపోయిన అన్వర్, కనకుండానే ఓ బిడ్డకు తల్లి అవుతుంది. తనని చిన్నప్పుడు ఎత్తుకొని తిరిగిన బావే తనకు భర్తగా మారి



హింసలకు గురి చేస్తాడు. తన అక్క చనిపోవడంతో, అక్క కన్నబిడ్డ కోసం తప్పనిసరి పరిస్థితిలో అన్వర్‌ని రెండవ భార్యగా పెళ్ళి చేసి ఆమె గొంతుకోశామని అటు తల్లిదండ్రులు, ఇటు అత్తగారు అనేక సందర్భాల్లో బాధపడినా వాళ్ళేమీ చేయలేని నిస్సహాయ స్థితిలో కూరుకుపోతారు.

సంక్షిప్తంగా కథ ఇదే అయినా, చల్లగాలి తాకితే వర్షమై కరిగిపోయే మేఘంలా కాకుండా జీవితంలో కొత్త మెరుపుల్ని పెదజల్లే, వర్షపు చినుకుల్ని కురిపించి జీవన ఫలాల్ని అందించగలిగే 'వెండి మేఘం'లా స్త్రీ జీవితం మారాలనే ఆశయం నవల నిండా కనిపిస్తుంది. ధృఢమైన సంకల్పం ఉంటే గానీ, కొన్నితరాలు, నష్టపోయినా నిరంతరం పోరాడితే గానీ స్త్రీల జీవితంలో వెలుగులు ప్రసరించవు. అది ముస్లిం స్త్రీలకు మరింతగా సరిపోతుందేమో!

మత గ్రంథాల పేరుతో, వాటిలోని విషయాల్ని దుర్వ్యాఖ్యానాలు చేస్తూ, వాస్తవాల్ని బయటకు రాకుండా చేస్తూ, స్త్రీని తమ బానిసగా మార్చుకుంటున్నారనీ, ఒకరికంటే ఎక్కువమంది స్త్రీలను పురుషుడు వివాహం చేసుకోవచ్చుననే సందర్భాన్ని చెప్పకుండా, అటు మతానికీ, ఇటు స్త్రీకి అన్యాయం చేస్తున్నారని గుర్తించమనీ, వాస్తవాల్నిఅందరూ తెలుసుకోవాలనే ఆరాటం కూడా నవలలో కనిపిస్తుంది. 'అన్వర్' పాత్ర ద్వారా ముస్లిం స్త్రీలలో రావాల్సిన చైతన్యాన్నీ, గుర్తించాల్సిన వాస్తవాన్నీ ఆశిస్తే, అన్వర్ అక్క 'సలీమున్' సంప్రదాయ ముస్లిం స్త్రీ జీవితానికి ప్రతినిధిగా, అన్వర్‌ని రెండో పెళ్ళి చేసుకున్న 'బాషా' ముస్లిం మతాన్నితమకి అనుకూలంగా మార్చుకుంటూ జీవితాల్ని ఎంజాయ్ చేస్తున్నవాళ్ళకి ప్రాతినిధ్యం వహించేటట్లు చిత్రించగలిగారా అని అనిపిస్తుంది. దూదేకుల జీవితాల్లో ఆశిస్తున్న మార్పుల్ని 'ఆదాం' పాత్రలో చూడగలిగే అవకాశం ఉంది.

ప్రస్తుత భారతదేశంలో 'ఇండియా పాకిస్తాన్' సంబంధాల్ని, మత విద్వేషాల్నీ, చరిత్ర గ్రంథాల్లోని విషయాల్నీ వివరిస్తూ ముకర్రం, జిలానీ, వాసు పాత్రల్నీ వర్ణించారు. నగరాల్లో జరుగుతున్న మత విద్వేషాలకు రియల్ ఎస్టేట్ వ్యాపారం కారణమవుతుందనే కోణాన్ని చూడాలనే కొత్త ఆలోచననీ ఈ నవల అందించగలిగింది. నవల రాయటంలో చాలా రచయిత సంయమనాన్ని పాటించగలిగారు. ముస్లిం అంతర్గత జీవితాన్ని విశదీకరిస్తూనే అవమానాల్నీ, పరాయీకరణలనూ, దయనీయ స్థితినీ, విద్యా, ఉద్యోగ రంగాల్లో ఎంపికలో

జరుగుతున్న పెద్ద పెద్ద పదవుల, బాధ్యతల, ఉద్యోగాల విషయంలో ముస్లింల మనోగతాల్ని స్పర్శిస్తూనే, సంకుచితత్వం నుండి బయటపడి స్వీయ అస్తిత్వాన్ని కాపాడుకోవటానికి ముస్లింలు నిరంతరం శ్రమించవలసిన అవసరాన్ని కూడా ఈ నవలలో వివవరించగలిగారు. ఈ నవల చదివిన వాళ్ళు పేద ముస్లింలకు ప్రభుత్వం రిజర్వేషన్లు ప్రకటించడంలో గల సామంజస్యాన్ని అంగీకరిస్తూనే, అవి దూదేకుల, పింజారీలు, నూర్ బాషీయులనే వాళ్ళకి ఇస్తే మంచిదనే అభిప్రాయానికి రాగలుగుతారు.

ఈ దేశ ముస్లింలలో, హిందూ ముస్లిం జీవన విధానం కలిసి మెలిసి పోవటానికి గల కారణాల్ని అన్వేషించకుండా, అరబ్బీ, ఉర్దూ మాట్లాడలేక పోతున్నారనో, నమాజ్ సరిగా చేయలేకపోతున్నారనో, ఇంకా హిందూ సంప్రదాయాల్నే పాటిస్తున్నారనో, దూదేకుల, పింజారీ, లద్దాఫ్, నూర్ బాషీయులను తక్కువగా చూడటం తగదనీ, తరతరాల వారసత్వ జీవన విధానం ఒక్కసారిగా మారిపోదనీ గుర్తించగలగాలనే ప్రబోధాన్నీ నవల అందించగలుగుతుంది.

మరో కోణంలో మంస్లింలలో నెలకొన్న మైనారిటీ భావన దానివల్ల పొందే ఆత్మన్యూనత, ఈ దేశంలో పుట్టి పెరిగి, దేశం కోసం ప్రాణాలర్పించి, ఈ నేలలోనే కలిసిపోతున్నా, నిత్యం దేశ భక్తిని నిరూపించుకోవాల్సిన అవమానాల పరంపరలు... పాకిస్తాన్ భారత్‌ల మధ్య క్రికెట్ జరిగినా, చరిత్ర క్లాసులో గజనీ మహమ్మద్ హిందూ దేవాలయాల ధ్వంసాన్ని వివరించినా, స్వదేశీ ముస్లింలను కొంతమంది విదేశీయులుగానే అనుమానపు చూపుల్తో బాధించటం, వాళ్ళని ఈ దేశం వదిలి పొమ్మనటం, నాటి చరిత్రలో ముస్లిం మత ఛాందసుల దుర్మార్గ దోపిడీలకు నేటి స్వదేశీ ముస్లింలు పరిహారం చెల్లించుకోవాలనటం, ఈ నెపంతో స్థానిక ముస్లింలను మతం పేరుతో హింసించటం ఎంతవరకు సమంజసమో ఆలోచించమని 'వెండి మేఘం' నవల చెప్తుంది.

'అన్వర్' లోని పవిత్రత, తద్వారా నిర్భయత్వం, స్వతంత్రతలను ముస్లిం సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక సమస్యల్ని ప్రతిభావంగా అందించిన నవలగా 'వెండి మేఘం' తెలుగు సాహిత్యంలో ఒక మైలురాయి కాగలదు.

(ఆంధ్రప్రభ సాహితీగవాక్షం లో 29 - 04- 2005 న ప్రచురితం)



# విప్లవ, దళిత ఉద్యమ నాయకత్వ విశ్లేషణ “*గుత్తికొండ*”

సమకాలీన సాహిత్యంలో 'విప్లవ కవిత్వం' ఎప్పుడూ ఒక నిత్య ప్రవంతిగానే కనిపిస్తుంటుంది. సమస్యలు ఉన్నంత వరకూ పోరాటాలు తప్పవని, అందుకు నిరంతర సంఘర్షణలు జరుగుతూనే ఉంటాయని విముక్తి పోరాటాలు నిరూపిస్తూనే ఉన్నాయి. విప్లవోద్యమంలో స్థలానికీ, వ్యక్తికీ చరిత్రలో ప్రాధాన్యం కనిపిస్తూ, అది వర్తమాన, భవిష్యత్తు తరాలవారికి ప్రేరణగా నిలుస్తుంటుంది. అందుకే వీరి ఉద్యమంలో ప్రాణాలు అర్పించిన/ కోల్పోయిన వారిని వీరులుగా స్మరించుకోవడం ఎక్కువగా కనిపిస్తుంది.

నక్సల్‌బరీ ప్రాంతానికీ, చారు మజుందార్‌కీ ప్రాధాన్యం ఇవ్వడంలో స్థలాన్నీ, వ్యక్తుల్ని గుర్తించటమంటే ఆ ఉద్యమ ఆశయాల్ని ప్రచారం చేయడమే! ఈ నేపథ్యంలో యువకవి కాశీం 'గుత్తికొండ' పేరుతో ఒక దీర్ఘకవితను ప్రచురించి, విప్లవ పార్టీల్లో చర్చనీయాంశాలవుతున్న అనేక అంశాలను మరోసారి ముందుకు తెచ్చాడు. కులం వల్ల వర్గం వల్ల అగ్రవర్ణం వాళ్ళే నాయకత్వం వహిస్తున్నారనీ ఉద్యమంలో నుండి బయటికి వచ్చేసినవారు చేసే ప్రకటనల్ని, దళిత - విప్లవ సంఘాల మధ్య ఉన్న అభిప్రాయాల్ని, గ్లోబలైజేషన్ ప్రభావాన్ని, దాన్ని ఎదుర్కోవటానికి కలిగించే

ప్రేరణని, మతవాద శక్తులతో అధికారం కోసం ఆరాటపడి పొత్తులు పెట్టుకొనే పార్టీల భావజాలాల్ని తనదైన దృక్పథంతో కవిత్వం చేస్తూనే, మేధోపరంగా ఆలోచనలకు పురిగొల్పడంతో వస్తు, రూపాలకు చక్కని సమన్వయాన్ని సాధించడం కనిపిస్తుంది.

పుస్తకం మూడు భాగాల్లో ఉంది. కవి స్వీయానుభవ ముద్ర మొదటి భాగంలోనూ, రెండవ భాగంలో అంతర్జాతీయంగా కుట్ర జరుగుతున్న ప్రపంచీకరణ ప్రభావాన్నీ, దాన్ని విప్లవకారులు ఎదుర్కొంటున్న తీరుతెన్నుల్ని, మూడవ భాగంలో హైదరాబాద్‌లో విప్లవకారులతో జరిగే/ జరగబోయే శాంతి చర్చల వల్ల మారిపోతున్న వాతావరణాన్ని, మరో వైపు ఉద్యమం నుండి బయటకు వచ్చినవాళ్లు తీసుకునే నిర్ణయాల్ని ఖండిస్తూ పోరాటాల వైపు మరల మనే ప్రబోధాన్ని చేయడం వంటి వాటిని వర్ణించాడు.

నిజానికి నేడు కొన్ని విప్లవ పార్టీలు కూడా 'కులాన్ని' అంగీకరిస్తున్నాయి. కుల ప్రభావాన్ని గమనిస్తున్నాయి. అయితే దాన్ని 'వర్గం' లో అంతర్భాగంగానే పరిగణిస్తున్నాయి. దళిత సంఘాలు/ పార్టీలు విప్లవ పార్టీలను 'కులం' గురించి నిలదీయడంలో శత్రువైరుధ్యం కంటే మిత్రవైరుధ్యమే గమనించవలసి ఉంది. విప్లవ పార్టీల్లో, ఉద్యమాల్లో అత్యధికులు దళితులే ఉండటం, పీడితులుగా దళితులే ముందుగా నష్టపోవడం వంటివే కాకుండా 'పీడితుల' పక్షం కోసం పోరాడే వాళ్లయిన విప్లవ పార్టీల్ని దళితులు నిలదీయడంలో ' ఆత్మీయమైన హక్కు' ఉన్నట్లు భావిస్తారు. మతవాద పార్టీల్ని ఇదే ప్రశ్నతో దళితులు నిలదీయకపోవడానికి కారణం, అవి ఎలాగూ వ్యతిరేకమనే అభిప్రాయం ఉండటమే ప్రధాన కారణం కావచ్చు. అందుకనే విప్లవ పార్టీల వాళ్లు దళితులను చేజార్చుకోలేరు. కనుక, తమ పోరాట ఎవరి కోసమో చెప్తూ కాశీం....

*"ప్యాపిలిలో*
*మనవాడు కాని*
*గణేషుడి కోసం గొడవెందుకు*
*నిశ్శబ్దంగా కనిపించే ఈ గణేష్*
*నడిరాతిరి నక్షత్రాల వెలుగులో*
*చంద్రుణ్ని సాయుధుణ్ని చేస్తున్నాడు'* (పు.6)



అనడంలో 'ప్యాపలి' సంఘటతో కులాన్ని బట్టి హత్యలు జరిగినా విప్లవ పార్టీలు తమదనైన రీతిలో తీర్పు చెప్పడం జరిగింది. మావోయిస్టు నేత రామకృష్ణ ఆధిపత్య కులంలో పుట్టినా అతనికి 'కుల స్వభావం' లేదని చెప్తూ.....

*"అతడు మా నేస్తం*
*వసంతకాల మేఘగర్జనతో*
*అంటరాని వాకిట్లో*
*మా నొసటిపై రాలిన*
*తొలి వానచినుకు"* (పు.3)గా ప్రశంసిస్తాడు కవి.

ఒకప్పుడు గుత్తికొండలో రాముడు తిరిగాడని పురాణాలు చెప్తున్నా, రాముడు
*'మా వాడు కాదని*
*శంబూకుడి శిరచ్ఛేదన చరిత్ర తెల్పింది"* అని అనడం, వెంటనే
*'అప్పడేమో*
*రామకృష్ణ*
*పెదాల మీద చిరునవ్వుతో*
*ఎనిమిది కోట్ల ఆంధ్రుల హృదయాలపై*
*లాంగ్‌మార్చ్‌కు బాటలేస్తున్నాడు"* అని 'చరిత్ర'కు నిజమైన అర్థం పరమార్థం 'గుత్తికొండ' ఏర్పరుచుకుందనిగర్విస్తున్నాడు.

సైద్ధాంతిక అవగాహన కవికి ఉండబట్టే, చిన్న కావ్యమైనా సుదీర్ఘంగా చర్చించాల్సిన ఎన్నో భావాల్ని సమర్థవంతంగా వర్ణించగలిగాడు.
*'పదునెక్కుతున్న ప్రాయాన్ని*
*ముక్కలు చేసి*
*సైబర్ కేఫ్‌లకు వేలాడదీస్తున్న '* గ్లోబలైజేషన్ ప్రభావాన్ని పట్టుకోగలిగాడు.

దళిత ఉద్యమం'లో రాజ్యాధికారం ఒక ముఖ్యమైన అంశమైనా దళిత సాహిత్యం కూడా దీనికి వత్తాసు పలకడంతో కొంత మందికి కొన్ని విభేదాలున్నాయి. రాజ్యాధికారం పొందడమంటే దళితులు పాలకులు కావడమా? దళితులకే ప్రత్యేక రాష్ట్రం/ దేశం ఏర్పడడమా? అప్పుడు దళితులంతా బాగుపడిపోతారా? ఇప్పటికే ఐదు దశాబ్దాల నుంచి దళితులకు

రిజర్వేషన్లు అమలవుతున్నాయి. రాజకీయ పార్టీలో సీటు వచ్చే వరకూ, నెగ్గే వరకూ తప్ప పదవుల్లో ఉన్న దళిత నేతలు ఎంత మంది హీనాతిహీనమైన స్థితిలో ఉన్న దళితుల్ని, వారి సమస్యల్ని పట్టించుకునే స్థితిలో ఉన్నారు? దీనికి అనేక సాకులు చెప్తారు. అధికార పీఠంపై ఉన్నా అధికారం చెలాయించే స్థితి రాలేదని రిజర్వేషన్లపై పొందిన పదవుల్లో ఉండి రిజర్వేషన్ పొందవలసినవాళ్ల ప్రతినిధిగా వాళ్ల హక్కుల్ని సాధించలేనప్పుడు రాజీనామా చేసి బయటకు రాగలరా? సమాజానికి నేటికి దూరంగానే జీవిస్తున్న వాళ్లలో దళితులు అనేక మంది ఉన్నారు. జీవన స్రవంతిలోకి అటువంటి దళితుల్ని తీసుకు రాగలిగితే, వాళ్లే వాళ్ల హక్కుల్ని సాధించుకోగలుగుతారు. అలా కాకుండా దళితులు రాజ్యాధికారం సాధించినప్పుడే దళితులు ఉన్నత స్థితిలోకి వచ్చేస్తారనడం ఆలోచించవలసిన విషయమే!

విప్లవ పార్టీలో ఆధిపత్య కులాల వారే నాయకత్వం వహించడం పట్ల దళిత వర్గాల్లో నిరసన ఉంది. దాని వల్లనే చాలా మంది ఉద్యమం నుండి బయటకి వచ్చేస్తున్నట్లు అప్పుడప్పుడు వచ్చే పత్రికా ప్రకటనలే సాక్ష్యం. ఆధిపత్య కులంలో పుట్టినా కుల నిర్మూలన, పీడితుల పక్షం వహించే ఉత్తమ నాయకత్వాన్ని పోగొట్టుకోవలసిన పని లేదు. ఇది ఎలాంటిదంటే, దళితులుగా పుట్టి, ఉన్న పదవుల్లో ఉండి, దళితులకు ఉపయోగపడనివారి కంటే దళితుల అభ్యున్నతి గురించి కృషి చేసే వారెవరైనా దళిత/ పీడిత అభ్యున్నతిని ఆశించినవాళ్లే అవుతారని భావించడం వంటిది. దళిత/ పీడిత కులాల్లో నాయకత్వ స్థాయికి ఎదిగిన వాళ్లని గుర్తించినప్పుడు కచ్చితంగా కొన్ని సంఘర్షణలు, సమస్యలు తప్పవు. ఈ విషయాల పట్ల కాశీం తన అభిప్రాయాల్ని స్పష్టం చేశాడు.

*' ఉట్టి మీద ఒట్టి తునకల్ని*
*మునవేళ్లతో ముద్దాడి*
*కొవ్వు సృష్టించేశాడు*
*ట్రిగ్గర్ పట్టిన అగ్రతనాన్ని*
*క్లీన్ చేసిన*

*మనుషులు వాళ్లు'* అని వాళ్లకు క్లీన్‌చిట్ ఇస్తాడు. అంతేకాదు, సోఫాల్లో కూర్చుని కలలు కనే సోకాల్డ్ దళిత నేతల రాజ్యాధికార వీలునామాల్ని



ప్రశ్నిస్తాడు. దళిత కార్డుతో దేశ దేశాల్లో దర్జాగా తిరిగే దళిత మేధావుల్ని, హస్తినాపురం (ఢిల్లీ)లో మనువు (మతతత్వశక్తుల)తో జటకట్టడంలో గల సైద్ధాంతిక నిబద్ధతనుగమనించమంటున్నాడు.

కాశీం రాసింది చిన్న దీర్ఘ కావ్యమే. కానీ విప్లవ పార్టీకి గొప్ప స్ఫూర్తినివ్వడంలో గుత్తికొండ (దీర్ఘకవిత) కావ్యం నిర్వహించే పాత్ర నిర్వచించలేనిది. ఈ దీర్ఘ కావ్యం నిండా దీర్ఘంగా చర్చించవలసినన్ని అంశాలు నిండి ఉన్నాయి. ఇది ఉద్యమంతో సంబంధాలున్న వారికి మరింత ఆత్మీయ స్పర్శను కలిగించగలుగుతుంది.

( గుత్తికొండ (దీర్ఘకవిత); కవి: కాశీం, వెల: రూ. 10/- పుటలు : 24; ప్రతులకు: సహచర బుక్‌హౌస్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్)

(17- 06- 2005న ఆంధ్రప్రభ సాహితీ గవాక్షంలో ప్రచురితం)

# మెరిసిన "*ఆంధ్రపురాణం*" సౌందర్యం

విమర్శకునికి ఉండవలసిన ప్రధాన లక్షణాల్లో 'భావుకత' ఒకటి. కవి భావించిన భావాన్ని విమర్శకుడు పట్టుకోగలిగే సామర్థ్యమే భావుకత. 'ధ్వన్యాలోకం' వ్యాఖ్యాత అభినవగుప్తుడు 'లోచనం' వ్యాఖ్యానంలో కూడా 'సహృదయత' గురించి చర్చించాడు. అయితే కవి వర్ణించిన 'కావ్యం' పాఠకులు అర్థం చేసుకోవడంలో విమర్శకుడు చాలా వరకు దోహదపడతాడు. పాండిత్యం బాగా ఉన్న విమర్శకునికి భావుకత, సహృదయత తోడయితే, కవి అప్రయత్నంగా వెలువరించిన భావాల్లోనే మహోన్నతమైన 'విషయాల్ని' బయటకు తీయగలుగుతాడు. ఆ విషయాన్ని చదివి, 'కవిగారే' ఆశ్చర్యపోయే సందర్భాలు కూడా కలగవచ్చు.

తెలుగు సాహిత్య విమర్శకుల్లో పాండిత్యం, సహృదయత, భావుకత ముప్పేటలా కలిగిన వారు చాలా మంది ఉండ బట్టే కొత్త కొత్త దృక్పథాలు, ధోరణులు బయటకు వస్తున్నాయి. అలాంటి సహృదయ విమర్శకుల్లో ఆచార్య అనుమాండ్ల భూమయ్యగారొకరు.

ఇటీవల '*ఆంధ్రపురాణం భారతీయ సంస్కృతి వైభవం*' పేరుతో ఆయన ఒక గ్రంథాన్ని రచించారు. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు ' ఆంధ్రపురాణం' రచించి, ప్రచురించి యాభై సంవత్సరాలైంది. మొదటిసారి



1954లో ప్రచురింపబడిన ఈ ' ఆంధ్రపురాణం' గురించి భూమయ్యగారి కంటే ముందు ఎందరో రాశారు. ఇంటర్మీడియట్, డిగ్రీ స్థాయిల్లో పాఠ్యాంశంగా ఈ గ్రంథాన్ని అనేక వేల మంది విద్యార్థులు దీన్ని చదువుకున్నారు. బి. నాగిరెడ్డి గారు ' ఆంధ్రపురాణం - సమగ్ర పరిశీలనం' పేరుతో పరిశోధన చేశారు. యువభారతి వారి ' ఇతిహాస లహరి'లో జి.వి. సుబ్రహ్మణ్యం గారు మంచి వ్యాసం రాశారు. ఇంత మంది ' ఆంధ్రపురాణం' గురించి రాయగా, మళ్లీ భూమయ్యగారు ఎందుకు రాశారనే దాన్ని తెలుసుకోవడమే ఈ చిరు సమీక్ష ఉద్దేశం.

ఆంధ్రపురాణం గురించి ఇంతకు ముందు రాసిన వారి కంటే అదనంగా భూమయ్య గారు భారతీయ సంస్కృతీ వైభవాన్ని చూడగలిగారు. సంస్కృతిలో ధర్మం ప్రధానంగా భావించి కావ్యానికి సౌందర్యభరితం చేశారు.

'కావ్య కథకు మూలం చరిత్ర, ఎన్నుకొన్నది కావ్య కళా మార్గం. చెప్పదలచుకున్నది ధర్మం. ఇది ఆంధ్రపురాణంలోని విషయం. ఈ కావ్య రచనకు రాజుల చరిత్ర సారకథనం ఒక మిష. ధర్మకథనమే ప్రధానాంశం' అని కావ్యాత్మను ఆవిష్కరించగలిగి పాఠకునికి కావ్య పఠనాభిరుచితో పాటు రచన ఔన్నత్యాన్ని మరింత పెంచగలిగారు.

ఆంధ్రపురాణంలో మధునాపంతులవారు రాజ వంశాల పేర్లతో తొమ్మిది పద్యాలు రాస్తే, భూమయ్య గారు ధర్మరక్షణ, భారతీయత, కళాసంపద, కావ్యకళ వంటి పేర్లతో తొమ్మిది విభాగాల్లో విశ్లేషించారు. మొత్తం రెండూ కలిస్తే పద్దెనిమిది సంఖ్య అవుతుంది. భారతీయ సాహిత్యంలో పద్దెనిమిదికి ప్రముఖ స్థానం ఉంది. ఈ దృష్టితో కూడా ఆంధ్ర పురాణాన్ని పద్దెనిమిది సంఖ్యతో ముడిపడేట్లు చేసి దాన్ని భారతీయ సంస్కృతి వైభవంగా నిలుపగలిగారు. సుమారు రెండు వేల నూట అరవై రెండు పద్యాలు గల కావ్యంలో 196 పద్యాల్ని అందిస్తూ పద్యాలన్నింటిలో గల కళాత్మక సౌందర్యాన్ని విశదీకరించారు.

రాజరాజ నరేంద్రుడు ఆంధ్ర మహాభారతాన్ని రాయించడానికి కారణాలు అనేకం ఉన్నా ధార్మికత కూడా ఉండబట్టే రాజ్యం, రాజులు పోయినా సాహిత్యం నేటికీ నిలబడి ఉంది. ఈ సందర్భంలో మధునాపంతుల సత్యనారాయణ గారు వర్ణించిన పద్యాన్ని భూమయ్య గారు

చమత్కారభరితంగా వ్యాఖ్యానించారు. ఆ పద్యం, వ్యాఖ్యానం చూస్తే మనకే తెలుస్తుంది.

*"కావున శ్రుత మత ధర్మ పు*
*జీవకు జివురిచ్చి పూల దేలించు వసం*
*తావిర్భావమునకు మీ*
*దీవన కావలయు గని సుధీ మధుమూర్తీ"*

ఇది రాజరాజనరేంద్రుడు నన్నయను మహాభారతాన్ని రచించమని కోరిన సందర్భంలో వర్ణించగా దీన్ని ఆచార్య భూమయ్యగారు "నన్నయను కవి సుధీ మధుమూర్తీ' అని సంబోధించినవాడు కవి. ఇది 'మధు'నాపంతుల కవిని సంబోధించినట్లు తెలుస్తుంది. ఇది రాజరాజు నన్నయను కోరినట్లు కనిపిస్తుంది. కానీ ఇక్కడ మధునాపంతుల కవి స్ఫురిస్తున్నాడు. ఆనాడు, నన్నయ వైదిక ధర్మ పునరుద్ధరణకు రాజరాజు ప్రేరణతో వ్యాసభారతాన్ని తెనిగించాడు. నేడు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు 'శ్రుత మత ధర్మపు జీవకు జివురిచ్చి పూల దేలించ'టానికి ఈ ఆంధ్ర పురాణ రచనకు పూనుకొన్నట్లు తెలుస్తుంది". ఇలాంటి వ్యాఖ్యానాలు ఆలోచనాపరులైన పాఠకుల్ని ఆహ్లాదంలో ముంచెత్తి ఆంధ్ర పురాణ సౌందర్యం మెరుపు మెరిసినట్లు అవుతుంది.

ఆంధ్రుల పుట్టు పూర్వోత్తరాల్ని వివిధ కథల్లో వర్ణించిన మధునాపంతుల వారి సుధారసాన్ని గొప్పగా ఈ విమర్శక పరిశోధకుడు వ్యాఖ్యానించారు.

మగధ సామ్రాజ్యంలో సామంతులుగా ఉన్న సాతవాహనులు స్వతంత్ర రాజులై తొలి తెలుగు రాజులుగా కీర్తి గాంచడం, వీరిలో హాలుని కథ రసవత్తరంగా ఉన్నాయి. చాళుక్య, కాకతీయ పర్వాల్లో చరిత్రను చెప్తున్నట్లు ఉన్న ధర్మం అంతర్లీనంగా దాగిన వైనాన్ని చక్కగా విశదీకరించగలిగారు. ప్రతాపరుద్రుడి ఆత్మహత్య సంఘటన హృద్యంగా ఉంది. ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి చదివే విద్యార్థులకు, తెలుసుకోవాలనుకునేవారికి మధునాపంతులవారి పద్యాలు చదివిన వెంటనే అర్థం చేసుకోలేనివారికి లేదా ఆ సామర్థ్యం లేనివారికి భూమయ్యగారి గ్రంథం అరటి పండు ఒలిచి పెట్టినట్లు ఉంటుంది.



గ్రంథం ఆసాంతం చదివితే చక్కని శైలి, పరిశోధనా పద్ధతి, సత్యాన్వేషణకు పురికొల్పుతుంది. ముఖచిత్రం హిమాలయాలు, అట్ట వెనక కాకతీయ తోరణం, వేయి స్తంభాల గుడి ఎంతో ఆకర్షణీయంగా మల్టీకలర్‌లో ముద్రించి చరిత్రలో కాకతీయ శిల్పానికి శాశ్వతత్వం సిద్ధింపజేశారు. భారతీయ సంస్కృతిని హిమాలయ చిత్రం ద్వారా, తాను నివసించే ఓరుగల్లు శిల్పాల్ని కాకతీయ తోరణం, వేయిస్తంభాల ద్వారా చూపి భారతీయతలో తెలుగు సంస్కృతి అంతర్భాగమనేది ఔచిత్యవంతంగా, ప్రతీకాత్మకంగా నిరూపించారు.

(ఆంధ్రపురాణం: భారతీయ సంస్కతీ వైభవం; రచన: ఆచార్య అనుమాండ్ల భూమయ్య; వెల: రూ. 75/-; ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగుడా, హైదరాబాద్)

(25- 07- 2005న ఆంధ్రప్రభ సాహితీ గవాక్షంలో ప్రచురితం)

# తెలంగాణ అస్తిత్వానికై
# “గుక్క” పట్టిన వేదన

సమాజాన్ని అవగాహన చేసుకున్న ఆధునిక కవి గొంతులో ప్రజల ఆర్తి పలుకుతుంది. తన అస్తిత్వం ఏమిటో అంచనా వేసుకోవటం కన్పిస్తుంది. అత్యవసర పరిస్థితి ధ్వనిస్తుంది. తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల నుండి వస్తున్న కథల్లో,కవిత్వంలో ప్రాంతీయ అస్తిత్వం పట్ల స్పష్టమైన దృక్పథం వ్యక్తమవుతుంది. కవికి దృక్పథం ఉండటం వల్ల తన కవిత్వం ఎవరి కోసమో, తన కవిత్వ ప్రయోజనం ఏమిటో గుర్తెరిగినట్లవుతుంది. కాసుల ప్రతాపరెడ్డి ఈ కోవ లోనే తెలంగాణ అస్తిత్వం కోసం నిజాయితీతో ఉద్యమ ప్రాయంగా కవిత్వం, కతలు, వ్యాసాలు రాస్తున్నాడు. తెలంగాణ కథలు, కవిత్వంపై వచ్చిన వ్యాసాల్ని పుస్తకాలుగాను అందుబాటులోకి తెస్తున్నాడు.

'భౌగోళిక సందర్భం', 'కొలుపు', 'తెలంగాణ తోవలు', 'తెలంగాణ కథ - దేవులాట' వంటి వ్యాససంపుటాల్లో గానీ, తన కథల పుస్తకం 'శిలువకు తొడిగిన మొగ్గ'లో గానీ, ఇప్పుడు ప్రచురించిన 'గుక్క' కవితాసంపుటిలో గానీ దేన్ని చూసినా తెలంగాణ బాగోగుల గురించిన తపనే ప్రధానంగా కనిపిస్తుంది. తన తెలంగాణ చరిత్ర, సంస్కృతుల పట్ల ప్రేమతో కూడిన బాధ్యత ప్రతిఫలిస్తుంది. తన విమర్శవ్యాసాల్లో, కథల్లో తనకి కావాల్సిందేమిటో



వాచ్యంగానే, స్పష్టంగానే, ధైర్యంగానే నిలదీసి అడిగితే కవిత్వంలో మాత్రం అందరి చేతా తెలంగాణ సమస్యను, ఆవేదనను అర్థం చేయించి, అనుభవింపజేసి, తన వాదనను అంగీకరింపజేసేలా ప్రయత్నిస్తాడు.

'గుక్క' దీర్ఘకవితతోపాటు ఈ పుస్తకంలో మరికొన్ని కవితలూ ఉన్నాయి. తెలంగాణా సంస్కృతినీ, జానపద పౌరాణిక, చారిత్రక గాథల్నీ, సందర్భాల్నీ, చివరికి చిన్నపిల్లలు, పెద్దవాళ్ల నోళ్లలో కూనిరాగాలయ్యే పాటల్ని కూడా తన కవిత్వంలో అంతర్భాం చేసి, తల్లి తెలంగాణ 'గుక్క' పట్టి దు:ఖిస్తున్న దయనీయ దృశ్యాన్ని చూపిస్తాడు. గ్రంథ ముఖచిత్రంలో కూడా నెత్తి బాదుకుంటూ రోదిస్తున్న స్త్రీ మూర్తి తల్లి తెలంగాణని స్ఫురింపజేస్తుంది.
స్వాతంత్ర్యానికి ముందూ, తర్వాతా తెలంగాణలో జరిగిన పోరాటాలు చారిత్రాత్మకమైనవి. స్వరూప స్వభావాల్లో తేడాలున్నా సిద్ధాంత నేపథ్యం మాత్రం పీడన, పరాయాకరణల నుండి విముక్తి కోరుకోవటమే తెలంగాణా పోరాటాల తత్త్వం!

*"చినిగిన బట్టలేసి కుట్టిన నేల*
*మొగుల కింద గన్నుల కోలాటాలు*
*పెయ్యంతా తూట్లే తూట్లు"* అని కవి కాసుల ప్రతాపరెడ్డి వర్ణించడంలో తెలంగాణ ప్రాంత పరిస్థితి కళ్ళకు కట్టినట్లుంది. "బట్టలేసి కుట్టిన నేల" అనే ప్రయోగం చేయడంలో గొప్ప ఔచిత్యం ఉంది. తెలంగాణ ప్రాంతంలో వివిధ రాజ్యాధికార జెండాలు ఎగిరిన చారిత్రక స్థితిగతుల్ని స్ఫురింపజేస్తున్నాడు. స్వాతంత్ర్యానికి పూర్వం నిజాం సంస్థానంలో తెలంగాణ, మరఠ్వాడా, కర్ణాటకలో గల భిన్న ప్రాంతాలతో, భిన్న సంస్కృతులతో నిండి, అధిక శాతం తెలుగు మాట్లాడే వాళ్లున్నా 'ముక్కు మొగం లేని దిక్కుమాలిన తెలుగువాళ్లు' (తెలంగీ బేడంగీ)గా ఎగతాళికి గురికాబడ్డారు.

రజాకార్ల దురంతాలు, దాని నుండి రక్షించుకొని భూస్వాముల దురంతాల నుండి కాపాడుకోవడానికి సాయుధ పోరాటం చేయటం, 1948 సెప్టెంబర్‌లో భారత ప్రభుత్వం చర్య తీసుకోవటం, 1950లో ముందుగా పౌరప్రభుత్వం ఏర్పడింది. ఆ తర్వాత 1952లో సాధారణ ఎన్నికలు జరగి, హైద్రాబాదు రాష్ట్రం ఏర్పడడం వంటి చారిత్రక సంఘటనలు జరిగాయి. అంటే అధికార జెండాలు మారాయి. ఆ తర్వాత అప్పటికే కుంఫిణీ వ్యాపారులు వాళ్ల

సౌలభ్యం కోసం తెలుగు మాట్లాడే వాళ్లందర్నీ ఒక ప్రాంతంగా కాకుండా సర్కారు జిల్లాలు, దత్తమండలాలు, చిత్తూరు, నెల్లూరు జిల్లాలవారిని మద్రాసు ప్రెసిడెన్సీలో కొంతమందిని విభజించటంతో తెలుగువాళ్లు, మద్రాసు ప్రెసిడెన్సీలోనూ భాషా సంస్కృతుల పట్ల వివక్షను ఎదుర్కోవలసి వచ్చింది. అప్పటి నుండే అనేక రంగాల్లో వెనుకబాటుతనాన్ని గుర్తించగలిగారు. ఈ పరిస్థితుల్లో తెలుగు మాట్లాడే వాళ్లంతా ఒక రాష్ట్రంగా ఏర్పడాలనే "భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన ఆకాంక్ష" హైదరాబాద్ స్టేట్‌గా ఉన్న తెలంగాణను, మద్రాస్ ప్రెసిడెన్సీలో బాధితులైన తెలుగువాళ్లను కలిసిపోవడానకి ప్రేరేపించింది. ఇక్కడ 'విశాలాంధ్ర' ఉద్యమం వరకూ ముందున్న తెలంగాణను పరిశీలించినా కవి 'చినిగిన బట్టలేసి కుట్టిన' అనే ప్రయోగ ఔచిత్యం వెల్లడవుతుంది.

సాయుధ పోరాటంలో, నేటి నక్సల్ (మావోయిస్టు) రాజకీయాల్లో ప్రభుత్వం తరఫు నుండీ, నక్సల్స్ నుండీ జరుగుతున్న కాల్పుల్ని, పోతున్న ప్రాణాల్ని 'మొగులు కింద గన్నుల కోలాటం'గా చెపపడంలో, కురవాల్సిన మేఘాలు, చల్లదనం అందించాల్సిన మేఘాల కింద నెత్తురు చారికలకు కవి ఆవేదనకు అక్షరరూపమే! దీనిలో ఒకానొక చారిత్రక పరిణామం, దాని ఫలితంగా దయనీయంగా మారిన తెలంగాణ బతుకు చిత్రం చూపగలిగాడు కవి. గతానికీ, వర్తమానానికీ ముడిపేస్తూ

*'పత్తి పంటల మీద పురుగుల మందు*
*పొలాల నిండా కొయ్యకాళ్లే*
*పర్రె కాలువలేవి, చెరువు ఊటలేవి?*
*మింటికీ ఒంటికీ ఏకధారగా కురుస్తున్న చీకటి*
*రెక్కలిరిగినై, కాళ్లు విరిగినై*
*చిలుకెగిరిపోతున్న ది, ఎగిరిపోతున్న ది*
*ఊగరా, ఊగరా!!*
*వాసాలు అందుకుని ఊగరా''* అని వెలుతురివ్వని, దక్కనివ్వని పోరాటాల స్థితిగతుల్ని చెప్తూ ప్రస్తుత తెలంగాణ స్థితికి ఆవేదనతో కుమిలిపోవటం కనిపిస్తుంది. త్యాగాలకు దక్కిన ఫలితం పేదరికమేనా అని ప్రశ్నిస్తున్నాడు.



విశాలాంధ్ర ఉద్యమం, పెద్దమనుషుల ఒప్పందం, ముల్కీ నిబంధనలు అన్నీ తెలంగాణను అభివృద్ధి పథంలో నడిపించగలవని అనుకున్నా, వాస్తవ పరిస్థితి దానికి భిన్నంగా కనిపించడం పట్ల కూడా కవికి ఆవేదన ఉంది. ఈ నేలపై ఉంటూ ఈ సంస్కృతిలో బతుకుతూ భాషనీ, ప్రజల్నీ తక్కువగా అంచనావేస్తూ, తన వాళ్లవల్లనే ఒక పరాయాకరణ జీవితాన్ని గడపవలసిన పరిస్థితిని జీర్ణించుకోలేకపోయే

*"నీ యావ వేరు*
*నీ రంది వేరు*
*నువ్వేమన్నా మా బాస రాసినవా?*
*మా యాస రాసినవా?*
*నీ రాతలకు మా తలరాతలకు పొంతనేది?*
*మనిసివిక్కడ, మనసక్కడ!*
*పాలు మర్సిన బిడ్డవైతివి, నీకేమెరుక?''* అని నిలదీస్తాడు. తెలంగాణ భాషను మాండలికంగా తీసిపారేయటం, సినిమాల్లో హీరోలకు కాకుండా రౌడీ పాత్రల చేత పలికించడం, కించపరచడం వంటివెన్నో జరుగుతున్న నేపథ్యాలన్నింటినీ గుర్తు చేస్తూనే తెలంగాణ ప్రజల్ని గుర్తించమంటున్నాడు కవి. తెలంగాణకు ఈ పరిస్థితి రావడానికి కారాణాన్ని అన్వేషించమంటూ –

*"ఎవరికి పుట్టిన బిడ్డరా అంటే*
*ఎక్కెక్కి ఏడ్చే తల్లి*
*ఏ గాలి సోకిందో, ఏ తూర్పు గాలి విసిరిందో*
*కాకులు దూరిన ఇల్లు*
*గుడ్లగూబలు చొచ్చిన ఇల్లు''* అని చెప్పడంలో ఆవేశం కూడా ఉంది. వర్షాలు లేవు. తన నేల నుండే ప్రవహించినా, తన నేల ఉపయోగించుకోలేని దుస్థితిలో గోదావరి జలాలు. పోనీ వర్షాలు కురవడం లేదు. పోనీ వర్షాలు కురవటం లేదు. దీనికి ఏవో పథకాలంటూ ఇజ్రాయెల్, నెదర్లాండ్ వ్యవసాయ పద్ధతులంటూ చేసినవన్నీ 'పథకాలకు పాతరేసి, పైసలెత్తుకుపోయిన గద్దలు'గా మారటం విషాదకరం. వ్యవసాయం ఎలా ఉన్నా తాగటానికి మంచినీళ్లు దొరకని పరిస్థితి. నల్లగొండ, మహబూబ్‌నగర్ జిల్లాల్లో ఫ్లోరైడ్ బారిన పడిన జీవితాలెన్నో! దీన్ని –

*విషమై పారుతున్న పాతాళగంగ*
*కాల్లొంకర, కండ్లొంకర*
*పసి పోరగాల్లయినా పండ్లిగిలిస్తే నల్లని గారలు''* అని ఫ్లోరోసిస్ వ్యాధి బారిన పడిన జీవితాల్ని చూపిస్తాడు. భగీరథుడుతన వంశాన్ని రక్షించుకోవడానికి తపస్సు చేసి ఆకాశగంగను పాతాళం దాకా ప్రవహించేట్లు చేశాడు. వాళ్లకు శాపవిముక్తి అయ్యిందో లేదో తెలియదు గానీ, వందలాది మీటర్ల లోతుల్లోకి తలతాకట్టు పెట్టయినా బోర్లు వేస్తే, వచ్చే నీళ్లు ఫ్లోరోసిస్‌ను తెచ్చి, తెలంగాణ ప్రజలకి విషంగా మారి నీటి శాపం వెంటాడుతున్న కతల్ని వినిపిస్తాడు. ఇంత జరుగుతున్నా, పీడితుల పక్షం వహించవలసిన పార్టీలు ప్రత్యేక తెలంగాణను వ్యతిరేకించడం పట్ల కూడా అధిక్షేపాన్ని ప్రకటిస్తూ –

*"మంత్రమేసెనో, మాయ చేసెనో, మరుగు మందే పెట్టెనో*
*ఆత్మ పంజరంలో పిట్ట*
*కదం తొక్కుతూ, పదం పాడుతూ*
*ఎర్రెర్రని పలుకులు, ఎదురొడ్డిన రొమ్ములు*
*వీరభక్త హన్మంతులు*
*గుండె చీల్చుకుంటే సూర్యుళ్లే*
*నిన్న నా, మొన్న నా, ఆవలి మొన్న నా*
*కాలచక్రం కింద నలిగిన దేహాలెన్నో''* అని చరిత్రలో పోరాటాల వల్ల ప్రాణాల్ని కోల్పోయిన వారిని గుర్తు చేస్తూ వారి పోరాటాలకి ప్రతిఫలం దక్కాలనే ఆశయాన్ని ప్రకటిస్తున్నాడు. అభివృద్ధికి ప్రత్యేక చర్యలు కాదనీ, సోది చెప్పటమో, శాంతి చేయటమో పరిష్కారానికి మార్గం చూపలేవంటూ –

*"మార్మానమొచ్చినోడు మదమెక్కి కూస్తుండు*
*కావాల్సింది యిడుపు కాయితాలే'* అనీ,
*" ఏరుపడటం తప్ప మాకు వేరు లేదు*
*నువ్వేంది చెప్ప తీర్పు చెప్పేది*
*మేమప్పుడే చెప్పినం*
*మాకు గట్టి గింజలు కావాలె, తాలు మాటలొద్దు''* అని తన నిర్ణయాన్ని ప్రకటిస్తాడు.



ప్రతాపరెడ్డి కవిత్వంలో తెలంగాణ సమస్యను జడ్జీ అనే పాఠకుడి ముందు లాయర్ లా తన వాదనాపటిమను ఆర్ద్రంగా వినిపిస్తున్నాడు. 'గుక్క' పట్టి ఏడుస్తున్న తల్లి తెలంగాణ దు:ఖాన్ని ఆపాలంటే నీళ్లు కావాలి. ఆ నీళ్లు దాహం తీర్చాలి. గొంతు తడపాలి. గొంతు తడిసి, దాహం తీర్చి, జీవశక్తి నివ్వగలిగదే నీళ్లు కావాలి. కన్నీళ్లు తుడవాలి. జానపద సాహిత్యంలో ఆణిముత్యం వంటి కథ 'బాలనాగమ్మ' కథ తెలంగాణ ప్రాంతానికి చెందిందే. దీన్ని కవిత్వంలో ఉపయోగించుకొంటూ, సంస్కృతిపరమైన కథల్ని తెలుసుకోమంటూనే చైతన్యానికి ఊపిరి కోణాల్ని చూపుతున్నాడు.

*"సోది చెప్పవచ్చిన తల్లి*
*శాంతి చేయాలంటున్నది*
*కాగల కార్యం తీర్చే గంధర్వులేరి?*
*బాలనాగమ్మ వో తల్లి, తెలంగాణా*
*చెర విడిపించే బాలవద్దిరాజేడి?''* అని ఒక చోట, మరో చోట-
*"ఏడేడు సముద్రాలు దాటావా, నా చిట్టి తండ్రీ*
*మర్రిచెట్టు తొర్రలో చిలుక దొరకనే లేదు*
*పిడికిలి నిండా పట్టి పిసికేయడానికి*
*పరిగెడుతూ ఉంటావా, ఎక్కడి దాకా?''* అనటంలోనూ, తెలంగాణ సమస్య పరిష్కారానికి చేయవలసిందేమిటో కూడా స్ఫురింపజేస్తున్నాడు. ఇలా కాసుల ప్రతాపరెడ్డి కవిత్వంలో వస్తువుని ఆశ్రయించుకున్న ప్రత్యేక శిల్పాన్ని కూడా వివరించుకుంటూ పోతే కవిత్వనిర్మాణాల్లో ఎన్నో రహస్యాలు బయటపడుతుంటాయి.

మీడియాని, జానపద గేయాల్ని, విప్లవ గీతాల్ని కూడా తెలంగాణ సాధనకు ఎలా వినియోగించుకోవచ్చో తన కవిత్వంలో రహస్యంగా అందరికీ అందంగా అందిస్తున్నాడు. వింటున్న పాటనూ, చూస్తున్న దృశ్యాన్నీ, రమ్యంగా చెబుతున్న కథనీ కూడా తెలంగాణ దృష్టితో చూడగలిగే విశిష్టశైలిని కాసుల ప్రతాపరెడ్డి కవిత్వంలో చూడగలిగే అవకాశం ఉంది.

ఉమ్మడి కుటుంబంలో ఉండటం వల్ల దొరకని ఏకాంతాన్ని వెతుక్కొనే సన్నివేశంలో 'కన్నులో మిసమిసలు కనిపించనీ, గుండెల్లో గుసగుసలు

వినిపించనీ' అని హీరోగారు ఓ సినిమా (దేవత?)లో పాడుతుంటాడు. కాసుల కవి దీన్ని

*"కన్నుల్లో బుసబుసలు కనిపించనీ*
*గుండెల్లో బాకు దించనీ"* అని అనుకరణరూపంలో కవిత్వమవ్వటం ఓ చైతన్యస్రవంతి శిల్పం నుండి పుట్టిన కొత్త ఊహ! మరో సినిమా అల్లూరి సీతారామారాజులో తెల్లవాడిని ప్రశ్నిస్తున్న సన్నివేశాన్నే స్ఫురింపజేస్తూ

*"ఎవడు వాడు, ఎచటి వాడు*
*ఇటువంటి నల్లవాడు*
*ఎందుకొచ్చిండో ఎరుకలేదాయె*
*కాకితో కబురైనా పెట్టకుండా వచ్చిన చుట్టమని*
*అంగలార్చి అక్కున చేర్చుకుంటి*
*నా నల్లనల్ల రేగళ్ల మీద పచ్చిపుండ్లు పడె"* అని తెలంగాణ సమస్యవైపు దృష్టి మరల్చేటట్లు కవిత్వీకరించాడు. సినిమా పాటల్నే కాదు విప్లవ పాటల్ని, పిల్లల్ని ఆడించే జాబిల్లి పాటల్లో కూడా చైతన్యాన్ని నింపే ప్రయత్నంలో

*"నీళ్లు మనవిరో, నేల మనదిరో*
*వాడి ఎవుసమేందిరో, వాడి దున్ను డేందిరో"*,
*"పైలం కొడుకో, కొమరన్న*
*జర భద్రం కొడుకో"* అనటంలో విప్లవ చైతన్యంలోని చైతన్యాన్నీ వినియోగించుకోవాలనే తపన ఉంది.

*"గొంగట్ల మెతుకులేసి ఏరుకోవడమే*
*చీకటి అర్రల ఒంటరి మొత్తుకోలు*
*చందమామ రాకె, జాబిల్ల రాకె"* అనగలిగేదంతా ఆలోచించవలసిందే. సరదా కోసం వీటిని ప్రయోగించడం లేదు. ఒక విశిష్ట ప్రయోజనాన్ని ఆశించే ప్రయోగిస్తున్నాడు కవి. గ్లోబలైజేషన్ పట్లా, ఆర్థిక సరళీకృత విధానాల పట్లా కడూ స్పష్టత ఉంది.

సమకాలీన తెలంగాణ రాజకీయ పొత్తుల పట్ల కవి అభిప్రాయం ఉంది. తన తెలంగాణ సర్వతోముఖాభివృద్ధి సాధించాలనే ఆర్తి తన కవిత్వం నిండా ఉంది. తెలంగాణ ప్రజలందరూ హత్తుకొదగింది. కవి, విమర్శకుడు గౌరీశంకర్ అన్నట్లు "కాసుల ప్రతాపరెడ్డి కవిత్వంలో భావోద్వేగం, పదునైన ఆలోచనలు



ఉన్నాయి. తెలంగాణా పటానికి అల్లుకున్న వలస గూడును తన చేతులతో చీరేసే ప్రయత్నం చేస్తున్నాడు". కవి రచనకు, నిబద్ధతకూ నిత్యం నిదర్శనంగా నిలుస్తూ 'గుక్క' పట్టి దు:ఖిస్తున్న తల్లి తెలంగాణ దాహాన్ని తీర్చమని ఆహ్వానిస్తున్నాడు. 'వలస'ను నిర్వచించవలసిన అవసరం ఉన్నా, సమస్యను పరిష్కరించడం మాత్రం అత్యవసరం. సొంత అస్తిత్వానికై 'గుక్క' పట్టిన తెలంగాణ కవిత్వం ఒక ఎమెర్జెన్సీ పోయిట్రీ.

(గుక్క (కవితా సంకలనం); కవి: కాసుల ప్రతాపరెడ్డి; వెల: రూ. 15/-;
ప్రతులకు: అన్ని ప్రధాన బుక్ షాపులల్లో లభించును.)

(10-10-2005 న విశాలాంధ్ర సాహిత్యానుబంధంలో దీనిలోని కొంత భాగం ప్రచురితం)

# దళిత స్త్రీవాదాన్ని వివరించిన 'మంకెనపువ్వు'

ఆధునిక సమాజ పరిణామాల్లో గమనించ వలసిన దానిలో ఒకటి మార్పు గుణాత్మకంగా పయనించడం. అలాంటి గుణాత్మక మార్పుని ఆశించడం స్వీయ అస్తిత్వం కోసం జరిగే పోరాటాల్లో ఒక ప్రధాన లక్ష్యం. అభ్యుదయ, విప్లవ, దిగంబర, స్త్రీ, దళిత, ప్రాంతీయ వాద సాహిత్యాలు సామాన్య మానవుణ్ణి, అతని ఆశలను , ఆశయాలను ప్రతిబింబించే దిశగా పయనిస్తున్నాయి. వీటిలోనూ ఉండే ఖాళీలనూ పూరించే ప్రయత్నంలోనే 'దళిత స్త్రీవాదం' ఒకటి వచ్చింది. ప్రతి సాహిత్య వాదం/ ఉద్యమం ముందుగా కవిత్వంలోనే అభివ్యక్తమవుతుంది.

చల్లపల్లి స్వరూపరాణి గారు 'మంకెనపువ్వు' పేరుతో ఒక కవితా సంపుటిని ప్రచురించారు. ఇందులోని కవితలు చాలా వరకు వివిధ పత్రికల్లో ముందుగా ప్రచురితమైనవే.అంతే కాదు వివిధ సాహితీవేత్తల చర్చల్లో ఉటకింపబడినవి అనేకం ఉన్నాయి. అంటే ఈ కవిత్వం చలనశీలన స్వభావం గలదని స్పష్టమవుతుంది. 'దళిత స్త్రీవాదానికి అచ్చమైన కవితారూపం'గా జి. లక్ష్మీనరసయ్య గారు, 'హృదయ దళన కవిత'గా డాక్టర్ ఎన్. గోపిగారు, 'తొలి దళిత స్త్రీవాద కవిత్వం'గా శిఖామణి గారు ఈ కవితా సంపుటిలో గల



కవిత్వం గురించి అభివర్ణించారు. దళిత కుటుంబాలలో తలిదండ్రుల ప్రవర్తనలో 'తల్లి'గా దళిత స్త్రీని కవయిత్రి స్వరూపరాణి చూడగలిగారు.

'బజాట్లో నీ అస్తిత్వం కేవలం ఫలానా ముత్తాయి పెళ్లాం మాత్రమే' అనడం ద్వారా స్త్రీవాదంలో లాగానే, సోమయాజి భార్య సోమిదేవమ్మగానే తప్ప దళిత స్త్రీని కూడా ప్రత్యేక అస్తిత్వంతో గుర్తించడం లేదని ఆవేదన వ్యక్తమవుతుంది. అయితే, ఇది అన్ని దళిత కుటుంబాల్లోనూ కనిపించే వాస్తవమేనా? అనేది ప్రశ్నించుకోవలసి ఉంది. అంటే కొన్ని కుటుంబాల్లో భర్త కన్నా భార్యకే ఆధిక్యత ఉంటుంది. దానికి కారణం పురుషుడితో సమానంగా, కొన్ని సార్లు ఎక్కువగా పని చేయడం, సంపాదించడం. ఇంకా చెప్పాలంటే పురుషుల కన్నా ఎక్కువ కష్టపడుతూ, ఆధిక్యాన్ని ప్రదర్శించే స్త్రీలు దళిత కుటుంబాల్లోనే ఎక్కువగా కనిపిస్తారు. కవయిత్రి ఇలాంటి స్త్రీలను స్పర్శించలేకపోవడం దళిత వాస్తవికతకు కొంత లోపమేనేమో. అయితే దళితులది స్వభావసిద్ధంగా మాతృస్వామ్యమైనా, ఆర్య సంస్కృతి ప్రభావం వల్ల పితృస్వామ్య స్వభావం దళితులపై ప్రభావం కనిపిస్తుంటుంది. దీన్నివర్ణిస్తూ కవయిత్రి' ఆర్యుల దగ్గర అప్పు తెచ్చుకున్న గొడ్డలితో ఆకాశమంత ఎత్తయిన' ఆమె ఆత్మను ముక్క ముక్కలుగా తెగనరకడానికి తెచ్చిపెట్టుకున్న ఆధిపత్య స్వభావమే కారణమని గుర్తించాలనే అవగాహన ఉంది. విశేషమేమిటంటే, "నన్ను వెలిగించే నాన్న స్మృతికి' అంటూ 'నాన్నా ఎంతకీ తెల్లవారని నా చిక్కుముడుల చీకటి కుహరంలో నీ స్మృతి పలచని పొద్దులా మెరుస్తుంది' అని దళిత స్మృ తి కవిత్వాన్ని రాశారు. తద్వారా దళిత తల్లిదండ్రులలో గల ఆదరించే, ప్రేమించే గుణాన్ని, త్యాగనిరతిని ఆలోచింపజేస్తున్నారు.

అలాంటి కుటుంబం నుంచి వచ్చిన దళిత బాలిక 'పెచ్చులూడిన బాల్యాన్ని' అనుభవిస్తూనే, పరిగె ఏరుకుంటూనే, దొంగతనంగా తెలిసీ తెలియని వయస్సులో 'పిల్లి పెసరకాయలను కోసుకొంటూనే' చదువులో అధిక మార్కులు తెచ్చుకోవడం, దాన్ని చూసి తన దళితేతర స్నేహితురాలను ఆమె తల్లిదండ్రులు చదువు సంజా లేని పిల్లకి మార్కులొస్తున్నాయని కొట్టడం వంటి సంఘటనలు ఎన్నో రికార్డు చేసిన కవిత్వం ఇది. చదివించాలనే తహతహతో దళిత తల్లిదండ్రులు తమ పిల్లలను

హాస్టల్లో వేస్తున్నారు. కానీ, ఆడపిల్లల హాస్టల్స్ లో జరిగేదేమిటి? "అక్కడ కూడా వార్డెన్ గాడి ఆకలి చూపులు". వాటి నుంచి తప్పించుకోలేక, మానసిక వ్యధకు గురవుతున్న వాళ్లెందరో! 'ఒంటిని గుప్పిట్లోకి తీసుకొని దూరంగా విసిరేయాలని'నిపించడం గొప్ప వ్యక్తీకరణ.

దళిత యువతి ఎలాగో కష్టపడి చదువుతుంది, అవమానాలకూ ఎదురీదుతుంది, ఉద్యోగం సాధిస్తుంది, ఆ తర్వాత ఆఫీసులో దళిత ఉద్యోగిని పట్ల ప్రవర్తన ఎలా ఉంటుంది? "ఆఫీసుకెళ్లినప్పుడు రిజర్వేషన్ కేటగిరి" అనే గుసగుసల్ని వినలేక నాకే నా చెవుల్లో సీసం పోసుకోవాలనిపిస్తుంది" అనడంలో వేదాలను వినకూడదని ఒకప్పుడు దళితుల చెవుల్లో సీసం పోస్తే, వేదాలను వల్లించిన నోళ్లు దెయ్యాలై, పిశాచ భాషతో కర్ణభేరి పగలగొడుతున్న వర్తమాన వాస్తవాన్ని కవిత్వీకరించడం ద్వారా, దళితుల మెరిట్ని అంగీకరించలేని సత్యాన్ని అభివ్యక్తీకరించగలిగారు. ఈ పరిస్థితుల నుండి బయటపడాలంటే, ఆత్మ గౌరవంతో బతకాలంటే, ఆత్మవంచన చేసుకోకుండా, 'సిసలైన మనుషులుగా మనగలగా'లంటే, భవిష్యత్తరాలు దళిత కవిత్వం 'రాయనక్కర్లేని పరిస్థితి రావాలంటే, సామూహికంగా, యుద్ధాన్నే నిత్యావసర వస్తువుగా చేసుకోక తప్పదంటున్నారు కవయిత్రి! దళిత స్త్రీవాదం ద్వారా 'స్త్రీవాదం' పట్టించుకోని అంశాలు ఎన్నో ఈ కవితాసంకలనంలో ఉన్నాయి.

(మంకెనపువ్వు (కవితాసంపుటి); కవి: చల్లపల్లి స్వరూపరాణి; వెల: రూ. 40/-;
ప్రతులకు: విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు)

(http://.thatstelugu.oneindia.in లో 18-11-2005 న ప్రచురితం.)



# స్ఫూర్తినిచ్చే "అంబేడ్కర్ దినచర్య"

*"ఏ పనైనా చేయాలంటే మనిషిలో సంకల్పం, సంయమనం, మరియు ఏకాగ్రత ఖచ్చితంగా కావాలి. నేను, సంకల్పం, సంయమనం లేనివారిని అసహ్యించుకుంటాను."* - ఈ మాటలు అన్నది ఎవరో కాదు, డా. బి.ఆర్. అంబేడ్కర్. దళిత చైతన్యం ఉన్న ప్రతి రచయితా ఆయన గురించి ఏదో ఒక ప్రక్రియలో రాశారు. సీతారాముల కథను తెలిపే రామాయణాన్ని మళ్ళీ మళ్ళీ రాయటం తమ జీవన్ముక్తికి మార్గంగా చాలా మంది భావిస్తారు. మళ్ళీ మళ్ళీ రామాయణాన్ని రాయవలసిన అవసరం ఏమిటో విశ్వనాథ సత్యనారాయణ గారు "మరల నిదేల రామాయణంబన్నచో" అనే పద్యంలో విశదీకరించారు. రామాయణం రాయడం హిందువులకు పవిత్రదాయకమైతే అంబేడ్కర్ గురించి చెప్పటం, రాయటం దళితులకు విముక్తి మార్గంగా భావిస్తారు. దీనిలో భాగంగానే దేవీ దయాళ్ అంబేడ్కర్ గారి దినచర్య హిందీలో ఒక పుస్తకంగా రాశారు. దాన్ని డా.జి.వి. రత్నాకర్ "అంబేడ్కర్ దినచర్య" పేరుతో తెలుగులోకి అనువాదం చేశారు.

దేవీ దయాళ్ 1943 నుండి 1951 వరకు అంబేడ్కర్ ఇంటిలో లైబ్రరీ బాధ్యతలు నిర్వహించేవారు. అంబేడ్కర్ గారిని దగ్గరుండి పరిశీలించిన విషయాలను ప్రధానంగా ఆయన దినచర్యకు సంబంధించిన విషయాలను ఎప్పటికప్పుడు డైరీలో రాసుకుంటుండేవారు. వాటిని 1987 తర్వాత హిందీలో

ఒక పుస్తకంగా రాశారు. ఈ పుస్తకంలో ఉన్న విషయాలు అంతకుముందు ఎక్కడా కనిపించవని ముందుమాటల్లో ఆయా రచయితలు చెప్పారు.

ఈ పుస్తకం చాలా మంది రాసుకునే దినచర్యల్లా పొద్దున్న లేచింది మొదలు పడుకునే వరకూ జరిగిన సంఘటనల సమాహార క్రమాన్ని వివరించే పద్ధతిలో ఉండదు. డా. అంబేడ్కర్ ఇంటిని, ఆ పరిసర వాతావరణాన్ని, ఆయన పడుకునే పడక గది స్థితిగతుల్ని, కథలో చెప్పతున్నట్టుగా కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు. నిజానికి ఈ దినచర్య ఒక కథ చెప్పతున్నట్లు ఆసక్తిదాయమైన కథనంతో కొనసాగింది. సాధారణంగా దినచర్య ఉత్తమ పురుషలో ఉంటుంది. కానీ ఇది అలా లేదు. అంబేడ్కర్ దినచర్యను మరొకరు చెప్పటమే దానికి ప్రధాన కారణం. ఆయన జీవితంలో సమయ పాలన, క్రమశిక్షణ, విజ్ఞాన సాధనలో జీవనాన్ని ఆనందమయంగా చేసుకోవటం అనేవి ప్రముఖంగా కనిపిస్తాయి.

పత్రికలను ఆసాంతం చదవటం, అవసరమైన క్లిప్పింగులను భద్రపరిచేటట్లు చెయ్యటం, వాటిని తన రచనల్లో ఉపయోగించుకోవటం వంటివి అంబేడ్కర్ చేసేవారు. సందర్భోచితంగా మంచి దుస్తులు ధరించడానికి ఆసక్తి చూపేవారు. తన జీవితంలో ఎక్కువ కాలాన్ని చదవడానికి, రాయడానికే ఎక్కువగా వినియోగించుకునేవారు. అవసరమైతే టాయిలెట్‌లోనూ, టిఫిన్ తినేటప్పుడూ, ప్రయాణంలోనూ చదువుకునే వారు. ఆరోగ్యం విషయంలో యోగా కూడా చేసేవారు. తన భార్య ఉన్నంత కాలం మంచి ఆహారాన్ని తినడానికి ఇష్టపడే అంబేడ్కర్ తర్వాత కాలంలో వంటవాళ్ళు ఏది పెట్టినా పట్టించుకునే వారు కాదు. నవలలు, కథలు చదవడానికి ఇష్టపడేవారు కాదు. వేదాలు, స్మృతులు వంటివి కష్టమైనా వాటి అనువాదాల సహాయంతో విజ్ఞానార్జనకు కష్టమైన సాహిత్యాన్ని చదవడమే తనకిష్టం అనేవారు. తాను చదివిన దాన్ని నిరంతరం రాసుకుంటుండేవారు.

డా// బి.ఆర్. అంబేద్కర్ దినచర్యనంతా గమనించినపుడు, జ్ఞానాన్ని సంపాదించడం, క్రమశిక్షణలో ఉండటం, సమాజ హితం కోసం తమ జీవితాల్ని ఫణంగా పెట్టడం అనే ఈ మూడింటిని ఏ మనిషైతే జీవన లక్ష్యాలుగా చేసుకుంటాడో అతడు సంపూర్ణమైన జీవితాన్ని గడిపినట్లు,



అప్పుడు అతడు దు:ఖితుడు కానట్లు అంబేడ్కర్ భావించినట్లు స్పష్టమవుతుంది. కేవలం అంబేడ్కర్ రోజువారీ కార్యకలాపాలే కాకుండా ఆయన వ్యక్తిత్వాన్ని కూడా దేవీ దయాళ్ విశ్లేషణాత్మకంగా స్ఫూర్తిదాయకంగా వివరించగలిగారు.

మొత్తం మీద "అంబేడ్కర్ దినచర్య" అనువాదంలా కాక తెలుగు రచనే అన్నట్లు ఉంది. అయితే, కొన్ని చోట్ల గౌరవ ఏకవచనం మరి కొన్ని చోట్ల ఏకవచన సంబోధనతో రచన కొనసాగింది. మూలం ఎలా ఉందో తెలియదు కానీ, ఒకే పద్ధతిలో ఈ సంబోధన ఉంటే మరింత బాగుండేది. అంబేడ్కర్ జీవిత చరిత్రలలో ఎండ్లూరి రాసిన గ్రంథం చాలా మందిపై ప్రభావాన్ని చూపింది. మళ్ళీ అంతటి ప్రభావాన్ని ఈ పుస్తకం కలిగిస్తుందనడంలో సందేహంలేదు.

("అంబేడ్కర్ దినచర్య " తెలుగు అనువాదం - డా.జి.వి. రత్నాకర్ (మూల రచన : దేవీ దయాళ్), పుటలు : 64, పుస్తకం ఖరీదు : రూ. 30/-, ప్రతులకు - సమాంతర బుక్ సెంటర్, 11-6-868, మొదటి అంతస్తు, లకిడికాపూల్, రెడ్ హిల్స్ రోడ్, హైదరాబాద్ - 04, ఫోన్ : 9246586254. )

(బహుజన కెరటాలు మాసపత్రికలో మే, 2006 న ప్రచురితం)

# వస్తు, శిల్పాల్లో కొత్త ఎల్లలు
# "ఎల్లమ్మ కథలు"

'శిల్పం' రచన నిర్మాణానికి సంబంధించినది. పాఠకుడు 'రచన'ను అర్థం చేసుకోవడంలో క్రియాత్మక ఊహాశక్తిని కలిగి ఉండాలి. ఇది భారతీయ ఆలంకారికులు చెప్పిన సహృదయతను మించిందని గమనించాలి. పాఠకునికి ఉండేది కేవలం సహృదయత మాత్రమే అయితే పాఠకుడు రచయిత కేంద్రితంగానే ఆలోచించవలసి వస్తుంది. అప్పుడది సానుభూతి వైపు పోయే వీలుంది. సమాజ కేంద్రాన్ని విస్మరించే అవకాశం ఉంది. రచయిత ఉద్దేశ్యాని వివరించడానికీ, సమాజ స్వరూప స్వభావాన్ని అవగతం చేయడానికీ రచయిత జోక్యం వర్ణన, వ్యాఖ్యానాల రూపంలో ఏ మాత్రం ఎక్కువైనా కథలో క్లుప్తత లోపించి, కథా సూచన మరుగైపోయి, పాఠకుని సవేదనలో గాఢమైన అనుభూతి ప్రవేశించదు.

ఏల్లమ్మ కథలో పాఠకుని క్రియాత్మక ఊహాశక్తిని శంకించకుండా ఈస్తటిక్ డిస్టెన్స్ ని పాటించాడు రచయిత. కథని లోతుగా చదివితే చెప్పకుండా సూచించి వదలి పెట్టిన విషయాలు బయటికికొస్తాయి. ఎల్లమ్మ కథలో పాత్రలకు 'సత్య', 'బాలమ్మ', 'ప్రశాంత్', అనే పేర్లు పెట్టడంలో, కథని ప్రారంభించేటప్పుడు వర్ణించిన వర్ణనలో సూచ్యార్థాలు ఉన్నాయి. వీటితో పాటు



గోడ మీద పుట్ట మాయమై పోవడం అనేది 'బాలమ్మ 'కు ఎల్లమ్మ పూనకం ప్రారంభం, ఎల్లమ్మ వదిలి వెళ్ళి పోయిందని చెప్పే క్రమంలోనే జరిగింది. అంటే పుట్ట పట్టడానికి ఎల్లమ్మ కారణమని బాలమ్మ నమ్మితే, సరిగ్గా ఎప్పటికప్పుడు తేమ లేకుండా, శుభ్రం చేసుకోవడమని సత్య నమ్మి, దాన్ని గీకేసి, ఇంక రాకుండా జాగ్రత్తలు తీసుకుంది. అలాంటి సత్య పొలం దగ్గరికి ఒంటరిగా వెళ్తున్నప్పుడు ఎల్లమ్మ తల్లి కనిపించిందనడం, మళ్ళీ కథను ముగిస్తూ ప్రశాంత్ చీకట్లో 'కాగడా' వెలుగు అంటాడు. కానీ, ఇక్కడ లోతుగా చూడవలసిన అంశాలు మూడున్నాయి.

సత్య ఒంటరిగా పొలం వెళ్తుంటే ఎల్లమ్మను చూశానంది. పెళ్ళికి ముందు వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాలు, పెళ్ళయిన తర్వాత అత్త గారు బాలమ్మ పూనకాలు, గ్రామస్తుల అనుమానపు చూపులు ఇవన్నీ సత్యను ఎల్లమ్మ గురించి ఆలోచించేటట్లు చేస్తున్నాయి. మానసికంగా, శారీరకంగా ఆ ఆలోచన ప్రభావం బలంగానే ఉందని దీని వల్ల తెలుస్తుంది.

ఫ్రాయిడ్ కలల సిద్ధాంతం, మానసిక శాస్త్రవేత్తల విశ్లేషణల ప్రకారం ఆలోచనలు దేని మీద కేంద్రీకృతమైతే అవే విషయాలు కలల రూపంలో కనిపిస్తుంటాయి. ఫలానా చోట అనే వదంతుల వల్ల ఒక్కో క్షణం అక్కడికి వచ్చేసరికి ఒక భ్రాంతికి కూడా గురయ్యే అవకాశం ఉంది. కనిపించే నీడ, కదిలే చెట్టు, వినిపించే కీచురాళ్ల శబ్దాలు ఆ సమయంలో ఒక భ్రాంతిలోకి నెట్టేస్తుంటాయి. రచయిత చాలా జాగ్రత్తగానే "ఇదంతా లిప్తపాటులో జరిగిపోయింది " అని సత్య చేతనే ఆ పాత్ర గురైన భ్రాంతిని వర్ణించే ప్రయత్నం చేశాడు.

ప్రశాంత్ కి 'కాగాడా వెలుగులు ' కనిపించడానికి అతని చిన్న వయస్సే కారణం. 'అతనికి పదేళ్లు ఉంటాయి' అని రచయిత చెప్పారు కూడా! సత్య పెద్ద చదువులు చదివింది కాదు. మరి ఆకాశరామన్న ఉత్తరాలు వచ్చినా, ఎల్లమ్మ తల్లి పూనుతుందన్నా, మంత్రాలతో బలులతో ఆ యిల్లు నిండిపోయిందన్నా పెళ్లికి సిద్ధపడటంలో ఆమె కుటుంబ పరిస్థితుల వల్ల వచ్చిన తెగింపు కూడా ఓ కారణం. అంటే ఆమె మానసిక ప్రవర్తనపై ఆర్థిక ప్రభావం పడిందన్నమాట. అంటే ఆర్థిక అస్తవ్యస్థత కొన్ని సార్లు మానసిక

బలహీనతకు లేదా మానసిక ధైర్యాన్నికి ఊతమిస్తుంది. ఇక్కడ సత్యలో పేదరికం వల్ల బలహీనతకు కారణమయ్యింది.

రెడ్లకు ఈ రోజుల్లో పెళ్లి జరగాలంటే ఎలాంటివి కావలిసి వస్తుందో కూడా కొంత చెప్పడం కథలో ఉంది. సత్యకు 'ఎల్లమ్మ ,' కనిపించినట్లు కలిగిన భ్రాంతికీ, ఆమె పెళ్లి చేసుకోవడానికి గల తెగింపుకీ ఇన్ని కారణాలను రచనలో సూచించాడు. అంతేకాదు, వయసు, జ్ఞానం చాలా వరకూ వాస్తవాన్ని గుర్తించేటట్లు చేయగలవు. ఆ విషయాన్ని హైదరాబాదులో ఉండే సత్య చిన్నమ్మ భర్త సీతారామిరెడ్డి పాత్ర (ఈ కథలో చిన్నదైనా) ద్వారా సూచించగలిగాడు రచయిత.

ఈ పాత్ర ద్వారా సత్యకి జ్ఞానోదయం కలిగిందనేటట్లు చెప్పడానికి, అదొక భ్రాంతి అనీ, పొలం దగ్గర ఉండే వాగుల గురించి, అప్పటికే ప్రచారంలో ఉన్న 'సిద్ధుల దేవుడి కథ ' చెప్పి అలాంటి కథలు కూడా సత్యలో భ్రాంతికి కారణాలయ్యాయనేది స్ఫురింపజేశాడు రచయిత. హైదరాబాదు స్థలాన్ని చెప్పడంలొ కూడా సీతారామిరెడ్డి చదువుకొని, విజ్ఞానాన్ని పొందిన ప్రాంతంలో ఇలాంటి మూఢ నమ్మకాలను నమ్మరనేదీ చెప్పినట్లయింది. ఒక వెనుకబడిన ప్రాంతంలో కొద్దో గొప్పో ఆలోచిస్తున్నారనే వాళ్లను కూడా మూఢ నమ్మకాలు ఎలా బలి పెడుతున్నాయో వాటి ప్రభావాన్ని సామాజిక కోణాన్నుండి చూపినట్లయింది.

ఈ కథల్లో 'కొసమలుపు'లో సీతారామిరెడ్డి మాటల వల్ల సత్యలో అజ్ఞానం తొలగిపోయిందని ముగించేందుకు సన్నివేశకల్పనను రచయిత చేయకపోవడానికి కూడా ఒక బలమైన కారణం శిల్ప దృష్ట్యా కూడా కనిపిస్తుంది.

ఈ కథలో ప్రతి పదాన్నీ, సన్నివేశాన్నీ, వర్ణననీ చాలా జాగ్రత్తగానే తీర్చిదిద్దడానికి ప్రయత్నించినట్లు తొలి, పునర్ముద్రణలను పరిశీలిస్తే తెలుస్తుంది.

తొలి ముద్రణ 'నేటి నిజం' దినపత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో జరిగింది. పెళ్లయిన కొన్నాళ్లకు సత్యకి ఒక అర్ధరాత్రి బాలమ్మ పూనకం కనిపిస్తుంది. అది ఎల్లమ్మ పూనకం అని తన తల్లి నమ్ముతున్నట్లు భర్త చెప్పాడు. తనకి ఎల్లమ్మ కనిపించిందనీ, పండగ చేయాలని చెప్పడానికి



వస్తున్న అత్తగారిని చూసేటప్పుడు 'సత్య ' భావాల గురించి వర్ణిస్తూ 'ఆమె ముఖం చూడాలంటే సత్యకు బెరుగ్గా ఉంది. " అని ఉన్న దాన్ని దట్స్ తెలుగు డాట్ కాం లో మార్పు చేశారు. 'ఆమె ముఖం చూడాలంటే సత్యకు బిడియంగా ఉంది' అని మార్చాడు. 'బిడియం ' అనడంలో తప్పు చేసి సిగ్గుపడే మానసిక స్థితి ఉండగా, 'బెరుగ్గా' లో బాలమ్మ చేష్టల వల్ల ఎప్పుడెలా మారుతుందోనన్న కించిత్ భయపడే మానసిక స్థితి వెల్లడవుతుంది.

ఇదెందుకు ప్రస్తావించానంటే, ఒక పదాన్ని వాడడానికే ఇంత లోతుగా ఆలోచించిన రచయిత ముగింపు అలా ఎందుకు చేశాడో రచయిత రచనా ఉద్దేశాన్ని, అంటే శిల్పగత విషయాన్ని గమనించమనే!

కథకి ముగింపు, ప్రారంభం కూడా చాలా ముఖ్యమైన అంగాలే. ఈ కథలో సీతారామిరెడ్డి మాటలు విన్న తర్వాత 'ఆమె కళ్లలో ఏదో కొంత కాంతి మెరిసినట్లయింది, ముఖం వికసించినట్లయింది. చలాకీగా గంతులేసుకుంటూ లేడి పిల్లలా వెళ్లిపోయింది ' అనో, మరో లాగో ముగించవచ్చు. ఇలా ముగిస్తే కథా ఫలశ్రుతి సత్యకు చెందుతుందా? కేవలం పెళ్లయి ఆరు నెలలయిన ఆమెకి వినడం ద్వారానే ఒక్కసారిగా హేతువాద దృష్టి అలవడి పోయిందనుకునే వీలుందా? అలా అయితే సత్య, బాలమ్మ లాంటి వాళ్లను మూఢవిశ్వాసాల నుండి ఎంత వేగంగానో బయటకు లాక్కోచ్చేయవచ్చు కదా! కానీ, సమాజంలో వ్యక్తుల వాస్తవిక ప్రవర్తన అలా ఉండాదు. సత్యకు ఇంకా వయసుతో పాటు అనుభవ జ్ఞానం కావాలి. మనిషికి 'సత్యం' అవగతం కావడానికి చాలా సమయం పడుతుంది. ఇలాంటి పాత్రను 'సాధారణ పాత్ర' ద్వారా వాస్తవ జీవిత చిత్రణ జరగడానికి అవకాశం ఉన్న పాత్ర అంటారు. అలాంటి 'పాత్ర' స్వభావం పట్ల పాఠకునికి నమ్మకం కలుగుతుంది. ఆలోచన పెరుగుతుంది. అలా ఎందుకు ప్రవర్తించిందో తెలుసుకోవాలనే సంవేదన కలుగుతుంది.

సామాజిక సమస్యల పరిష్కారం ఒకటి రెండు మాటలతోనో, రెండు మూడు నిరూపణలతోనో పరిష్కారం అయిపోదు. రాయలసీమలో 'మాతంగి' వ్యవస్థగా మారుతున్న సామాజిక సమస్యల్లో ఒకటి.

తెలంగాణలో బాణామతి ప్రయోగాలు, దేవతల పూనకాలు వంటివీ సామాజిక సమస్యలే.

వీటికి రెండు కోణాలున్నాయి.

సమాజంలో కొన్ని వర్గాలవారే వాటి బారిన పడడం, మరొక కోణంలో మరొక వర్గం వాటిని పెంచి పోషించి, తమ ప్రయోజనాలను నెరవేర్చుకోవడం - వ్యక్తులు, వ్యవస్థలు సమష్టిగా కృషి చేయకపోతే ప్రజల్లో శాస్త్రీయ దృష్టి పెరగదు. శాస్త్రీయ దృష్టి అనేది విజ్ఞాన విస్తరణతో ముడిపడి ఉంది.

కోస్తా ప్రాంతంలో ఇలాంటి సామాజిక సమస్యలు అంతగా కనిపించకుండా వెనుకబడిన తెలంగాణ, రాయలసీమ, కళింగాంధ్రల్లోనే ఎక్కువగా కనిపించడానికి విద్యాపరంగా విజ్ఞానాన్నీ, అదీ శాస్త్రీయ పద్ధతిలో అందించకపోవడమే ఒక ప్రధాన కారణం.

ఇవన్నీ సమాజ కేంద్రంగా ఉన్నాయి. సామాజిక బాధ్యతగల రచయిత ఇలాంటి సమస్యలను కళాత్మకంగా సృజనీకరిస్తాడు. అలాంటి రచన వస్తు, శిల్ప విషయాల్లో ఉన్నతమైందీ, ఉత్తమమైందీ అవుతుంది. 'ఎల్లమ్మ' కథలోనూ ఇంతటి ఉదాత్త విలువలున్నాయి. కథను ముగించడంలో, పాశ్చాత్యులు భావించిన 'ఎపిపనీ'నో, భారతీయులు భావించినట్లు 'కొసమలుపు' నో మాత్రమే గ్రహిస్తే పాత పంథాలో కథను రాసినట్లయ్యేది. ఎల్లమ్మ కథలో రచనాపరంగా కూడా ఒక కొత్త పంథా ఉంది. దీన్ని సాహితీవేత్తలు గుర్తిస్తే బాగుంటుంది.

(కాసుల ప్రతాపరెడ్డి రాసిన కథల సంపుటి ఎల్లమ్మ ఇతర కథలు లో ఎల్లమ్మ పేరుతో రాసిన కథను మాత్రమే విశ్లేషిస్తున్నాను. ఇది ఆయన కథల పుస్తకంలో కూడా ప్రచురించుకున్నారు.)

(ఆదివారం వార్త సాహిత్యానుబంధంలో 18-06-2006న ప్రచురితం)



# *అమెరికా యాత్రా... కవిత్వం*

ఈ రోజుల్లో ఎంత మంది అమెరికా వెళ్లడం లేదు. అమెరికా ఏమిటి ప్రపంచమే చుట్టి వస్తున్నారు. కానీ అలా ప్రపంచాన్ని చుట్టి వచ్చిన వాళ్లలో ఒక కవి గాని, ఒక కథకుడు గాని ఉంటే ఎలా ఉంటుంది? ఒక యాత్రా రచన తయారవుతుంది. తాను విన్నవీ కన్నవీ పది మందికి చూపే భాగ్యం కలుగుతుంది. అలాంటి ప్రయత్నమే చేశారు డా ఎండ్లూరి సుధాకర్. 'ఆటా' సాహిత్య సభలకని అమెరికా వెళ్లారు. అక్కడెన్నో అనుభవాల్ని మూటకట్టుకున్నారు. అసలే ఆయనో కవిత్వ చెలిమ. భూమ్యాకాశాల మధ్యలో తేలుతున్నప్పుడు ఊరుకుంటారా? సంస్కృతాంధ్ర కావ్యాల్లో కవ్వించిన రంభ, ఊర్వశి, మేనకలెక్కడైనా కనిపిస్తారేమోనని ఆకాశమంతా గాలించారు. పోనీ, మహతీ వీణానాదంతో కలహభోజనం చేసే నారదుడైనా కనిపించకపోతాడా అని అన్వేషించారు. అవేమీ కనిపించలేదు. కానీ, అతిశయోక్తి అలంకారాన్ని మాత్రం చూడగలిగారు. ఆకాశాన్ని తాకుతున్న అమెరికా భవనాల్ని తాకగలిగారు.

లాడెన్ భయంతో వణికి పోతున్న తెల్లవాళ్ల మనోభావాల్ని పసిగట్టగలిగారు. పసివాళ్లని భయపెట్టి, ఏడుపు నాపించగలిగేందుకు ఉపయోగపడుతున్న లాడెన్ నామ జపాన్నిచూడగలిగారు. ఇవన్నీ *'ఆటా' జనికాంచె... యాత్రా కవితల* పుస్తకంగా కూర్చారు. అది అమెరికా సాహిత్యాభిమాని డా బోయ రెడ్డి సుబ్రహ్మణ్య రెడ్డి సౌజన్యంతో అందమైన

పుస్తకంగా వెలువడింది. దీనిలో నిజానికి అమెరికా గురించి కవి అనుభవాలను కవిత్వీకరించినా, ఆ ప్రాంతాల వర్ణన అంతగా కనపడదు. ఆ ప్రాంత ప్రజల చింతన మాత్రం కనిపిస్తుంది. అతుకుల బతుకుల్లో కనిపించే చింత తెలుస్తుంది. భారతీయులు నేర్చుకోవలసిందేమిటో స్పష్టమవుతుంది. అలాస్పష్టం చెయ్యడంలో కవి వర్ణనా వైచిత్రీ ప్రియత్వం కనిపిస్తుంది. అది అమెరికా సుందరినీ, ద్రావిడ చిన్న దాన్నీ వర్ణించడంలో ఉంది. నీగ్రోల జీవితాలతో తన్మయత్వం చెందడంలో ఉంది. వైట్ హౌస్లో పాల్ రోబ్సన్ పాట వినాలన్న కవి గొంతులో ఉంది.

నేటికీ సాహితీ వేత్తలు *'మనుచరిత్ర*లో అల్లసాని పెద్దన చూసో, చూడకో వర్ణించిన హిమవత్పర్వత వర్ణన గొప్పగానే చెప్పుకుంటారు. ఈ కవి మాత్రం అమెరికా చూశారు. ఆ దారిలో కనిపించిన అనేక దేశాల్ని గమనించారు. అమెరికా ఆహ్వానం అందింది మొదలు, అక్కడికి వెళ్లి మళ్లీ మాతృ భూమికి తిరిగి వచ్చే వరకూ కవి భావ పరంపర చిన్న చిన్న కవితా ఖండికలుగానే అయినా బలమైన అభివ్యక్తితో పండింది. విమానం ఎక్కింది మొదలు తన మొదటి ఈ విదేశీ యానాన్ని అంతటినీ అలలు అలలుగా కవిత్వమై పొంగించారు. ఎదురైన వింతలన్నీ కవిత్వ సంతలయ్యాయి. తననిప్పుడు చూస్తే తండ్రెంతగా మురిసిపోతాడో చెప్తూ ప్రభువునిలా ప్రార్థిస్తారు!

*"మేఘ రథం మీద/ వాయు రథం మీద/ నా తండ్రిని తీసుకొస్తావా/ ఒక్కసారి చూపిస్తావా/కిటికీ దగ్గరే కూర్చున్నాను''* అని ఎప్పుడో పరలోకానికి పోయిన తన తండ్రి కోసం ప్రభుని ప్రార్థిస్తారు కవి. సాధరణంగా ఒక సగటు దళితుడు తినడానికి తగినంత సంపాదించు కోగలిగే సమయానికి తినే వయసు కోల్పోవడం జరుగుతుంది. అవమానాలను అధిగమించి ఆత్మగౌరవంతో తిరగగలిగే సమయానికి సొంత వాళ్లను కోల్పోవడంలో ఉన్న వేదన తెలియాలంటే, ఆ జీవితాలను అనుభవించిన వాళ్లే చెప్పగరేమో! అలాంటి అనుభవాలే అమెరికా వెళ్లేటప్పుడు కవిని ఆర్ద్రం చేశాయి.

ఒంటరిగా వెళ్తున్నా స్నేహితుల్ని గుర్తు చేసుకునేలా చేశాయి. అక్కడికెళ్లినా ఇక్కడి వాళ్లతోనే ఆ అనుభూతులు పెనవేసుకోగలిగాయి. ఈ కవితా సంపుటి చివరిలో *"అమెరికా తెలుగువారికి ఆంధ్రోళ్లనా లేఖ''* పేరుతో



రాసిన కవిత ఇరు దేశాల సంస్కృతీ సంబంధాల్లో వచ్చిన అనూహ్యమైన మార్పుల్ని కళ్లకు కట్టినట్లు వర్ణించగలిగింది.

*"బహుశా ఇప్పుడు*
*ప్రపంచమంతా రెండే జాతులన్నాయి*
*ఒకటి అమెరికనై రెండోది నానమెరికనై*
*మీరు విదేశాల్లో ఉన్నారన్న మాటే కానీ*
*మీకూ మాకూ అట్టే తేడా లేదు*
*మీకంటే మేమెందులోనూ తీసిపోలేదు''* అంటూనే సంస్కృతిలో వచ్చిన మార్పుల్ని ఎంతో పరిశీలనాత్మకంగానూ, వ్యంగ్యంగాను వర్ణించగలిగారు కవి.

*"గడప గడపకో రంగుల దెయ్యం*
*వంద చానళ్ల కోర్లతో తిష్టవేసిన'* స్థితినీ, గ్లోబలైజేషన్ వల్ల ఆహార, వ్యవహార, వేష భాషాదుల్లో వచ్చిన మార్పుల్ని, డాలర్ల వేటలకై తల్లి దండ్రుల్ని గూళ్లలోనే విడిచి పెట్టేసి గొప్ప గొప్ప చదువుల కోసం, డాలర్ల కోసం వలస పోతున్న బాబుల్ని కవిత్వంలో తడిమి చూపించగలిగారు.

పోనీ, స్వదేశంలోనే ఉంటే మాత్రం తల్లిదండ్రుల్ని చూసేస్తున్నారను కోవడానికి కూడా లేని కుటుంబాల్లోని విషాదాన్ని కూడా వెల్లడించారు.

*"ఇవాళ అమ్మానాన్నల చిరునామాలు అనాథాశ్రమాలు*
*తల్లిదండ్రుల మీద దయలేని సంతానం*
*స్వదేశంలో ఉంటేనేం*
*ప్రవాసంలో ఉంటేనేం?''* అంటూ మానవత్వానికి పట్టాభిషేకం చేశారు. పోనీ, పెద్ద పెద్ద చదువులు చదివి, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లై డాలర్లు సంపాదించాలని అమెరికా వెళ్తున్నారు. ఆ ఉద్యోగాల్లో ఎన్నాళ్లుంటున్నారు? ఎన్నాళ్లుండనిస్తున్నారు? మరి ఆ తర్వాత పరిస్థితి? స్వదేశం రాలేరు. దేశంలో ఉద్యోగం పొందలేరు. పెట్రోలు బంకులు, హొటళ్లు, పచ్చళ్ల అంగళ్లు ఉద్యోగాల కేంద్రాలు! ఇవన్నీ దయనీయమైన గాథలు. కనిపించని, చెప్పకోలేని అప్రయత్నంగా దారి తప్పిన జీవితాలు. ఇవన్నీ వీరి కలంలో కవితలుగా మారాయి.

అమెరికాలో వేడి వేడి భోజనం తింటున్నదెంతమంది? వాళ్ళకి బంధువులతో, ఇంటి సభ్యులతో కాసేపు గడిపే సమయమెక్కడుంది? ఫ్రిజుల్లో

దాచుకుని వారం రోజులు తాజాగా తినే బతుకుల్లో రుచుల్నీ తన కవిత్వంలో చూపించగలిగారు కవి. అక్కడ కూడా అక్కడక్కడ కనిపిస్తున్న కుల, మత, ప్రాంతీయ విద్వేషాలు భారతీయుల్లో కనిపించినందుకు విచారిస్తున్నారు. అవధానం వ్యక్తి కీర్తనగా మారుతున్న సాహిత్యాభిరుచిలో మార్పురావాలని ఆశిస్తున్నారు. అక్కడికి వెళ్లిన ఆ నీగ్రోల్లోనూ భారతీయ దళితుల్ని చూడగలిగారు. స్త్రీ పురుష సంబంధాల్లో గ్రహించవలసినవీ, విసర్జించ వలసినవీ ఉన్నాయని వాటిని వర్ణించగలిగారు. అక్కడ శిక్షణనూ, క్రమ శిక్షణనూ, క్రమంగా అమలవుతున్న శిక్షలనూ చూపారు. పోలీసుల క్రౌర్యం, శ్రామికుల జీవితాలు ప్రపంచంలో ప్రతిచోటా ఒకేలా ఉండటాన్ని చూసి ఆవేదన చెందారు.

కవి అమెరికా వెళ్లారు. ఆ ప్రయాణాన్ని ఒక అనందసమయంగా మార్చుకుంటారనుకుంటే, ఆ అనుభవాల్ని అక్షరీకరించి,ఆ దేశాన్నీ, ఆ దేశ ఆధిపత్యాన్ని నిరసిస్తూనే, అక్కడి నుండి కొన్నింటిని భారతీయులు కూడా నేర్చుకోవాల్సినవి ఉన్నాయన్నారు. స్వచ్ఛత, శుభ్రత, నాణ్యతలను అలవర్చుకోవాల్సి ఉందని, అణచివేతల్ని, అహంకారాన్ని, అణ్వాయుధాల్ని ద్వేషిస్తున్నానని, సమతను, మమతను, సమానత్వాన్ని ఆశిస్తున్నాననీ ప్రకటిస్తున్నారు కవి. దీనిలోనే 'అమెరికా యాత్ర' అమెరికా అనుభవం కలిగించిన జీవిత సత్యం వెల్లడవుతుంది. అమెరికా స్వరూప స్వభావం అవగతమవుతుంది. ఈ కవితల్లో విమానంలో పంచిన చాక్లెట్లు తన కూతురికి దాచిన సన్నివేశాన్ని, సహచరి మట్టి తెమ్మని కోరిన కోరికనీ కవిత్వమైన ఖండికలు ప్రతి పాఠకుడు చదివి తీరాల్సినవే! అమెరికా వెళ్లాలా, వద్దా? ఎందుకు వెళ్లాలి? అమెరికా వెళ్లే ముందు మన దేశంలో మన పాత్ర ఎలా ఉండాలి? అని ప్రశ్నించుకొని వాళ్ళూ, సహృదయ స్పందనలు వినాలనుకున్న వాళ్లు తప్పకుండా చదువు కోవాల్సిన పుస్తకమిది!

('*ఆటా' జని కాంచె...* (కవిత్వం), కవి: డా ఎండ్లూరి సుధాకర్, వెల: రూ. 50/-)

(http://.thatstelugu.oneindia.inలో 11- 08- 2006 న ప్రచురితం.)



# “బాలుడి శిల్పం” లో సామాన్యుడిలో అసామాన్యత

కవి, సీనియెర్ పాత్రికేయుడు కందుకూరి రమేష్ బాబు ఇటీవల తెలుగు సాహిత్యంలో ఒక కొత్త ద్వారాన్ని తెరిచే ప్రయత్నం చేస్తున్నారు. సామాన్య శాస్త్రం పేరుతో సామాన్యుల జీవితాలను పరిచయం చేస్తున్నారు. అది చదిన వారికి కూడా అలా రాయాలనే ప్రేరణ కూడా కలిగిస్తున్నారు. గొప్ప వ్యక్తుల గురించి చెప్పటం ఎవరికైనా చాలా సులభం. కానీ, సామాన్య వ్యక్తుల గురించి, అదీ చదివించే శైలిలో రాయటం సామాన్య విషయం కాదు. అందరి చేతా చదివించే గుణం ఆయన శైలిలో ఉంది. అలా రాయటానికి రచయిత చాలా సంఘుర్షణకు గుర్రై ఉంటారు.

స్పృహ సాహితీ సంస్థ వాళ్ళు హైదరబాదు సెంట్రల్ యూనివర్సిటిలో ది 25-9-2006 న కందుకూరి రమేష్ బాబు రాసిన రచనల పై కొంతమంది చేత మాట్లాడించారు. అందులో నన్నూ మాట్లాడమన్నారు. ఆయన రాసిన 'బాలుడి శిల్పం ' గురించి నేను మాట్లాడాను. నిజానికి రచయిత కందుకూరి రమేష్ బాబు గాని, పుస్తకం రాయబడిన చిత్రకారుడి గురించి గాని నాకు వ్యక్తిగతంగా తెలియదు. రమేష్ బాబు కవితలు చదివాను. వ్యాసాలు చాదివాను. అతని శైలిని మనసులోనే అభినందించుకున్నాను. వివిధ

పత్రికలో ఆయన గారి మంచి కవితలను ప్రచురిస్తున్న ఎడిటర్ గార్కి కొన్నిసార్లు ఉత్తరాలూ రాశాను. ఆనాటి నా ఉపన్యాసంలోని కొన్ని ముఖ్య విషయాలను ఇక్కడ రాస్తున్నాను.

కవిత, కథ,నవల, నాటకం వంటి ప్రక్రియల్లో రచయితకు స్వేచ్ఛ ఉంటుంది. సన్నివేశాలు, పాత్రలు, సంభాషణలు, వాతావరణ చిత్రణ వంటివన్నీ కల్పించుకోవచ్చు. వాటిని చిత్రించటంలో కళాత్మక వాస్తవికతను సాధించి ఆకర్షణీయం చేయవచ్చు. సృజనాత్మక రచయితకు సత్యాన్ని దర్శింప చేయటమే ప్రధానం. కానీ, కందుకూరి రమేష్ బాబు రాసిన ఈ పుస్తకం సృజనాత్మకమా? సృజనేతరమా? అనే ప్రశ్న వచ్చినప్పుడు వాస్తవాన్ని విస్మరించకుండా రాసే బయోగ్రఫి జాబితాలోకి దీన్ని చేర్చటం సమంజసం. బయోగ్రఫి లో సృజనాత్మకత ఉన్నా, సృజనేతర అంశానికే అధిక ప్రాధాన్యత ఉంటుంది. అంటే జీవిత చరిత్ర ప్రక్రియ అన్నమాట!

పుస్తకం చదువు తుంటే పాఠకులకు కొన్ని సందేహాలు కలుగుతుంటాయి. రచయిత సామాన్యుడి గురించి రాస్తున్నానని ప్రకటించారు. "బాలుడి శిల్పం " చూస్తే, ఎవరీ బాలుడు? ఆ బాలుడే “చిత్ర”. అసలు పేరు విఘ్నేశ్వరాచారి. ఆయన తండ్రి పేరు నందిపాటి జానయ్య ఆయనలో కనిపించే అసామాన్య అంశాలు ఒక చర్చ:

1) జానయ్య తయారు చేసిన దేవుల్లతో పాటు, ఆయన్నీ (నందిపాటి జానయ్య ) ప్రజలు ఊరేగించారట! తండ్రి లాగే 'చిత్ర ' నీ ప్రజలు ఊరేగించారు.
2) మహానటుడు యన్. టి. రామారావు గారి చేత ప్రసంశలు పొందిన వారు.
3) చిత్ర ఎగ్జిబిషన్ ఏర్పాటు చేస్తే, ఫెయిర్ & లవ్లీ ప్రకటనలో నటించిన సినీ నటి పూనం కౌర్ తన కారులో వెళ్ళి చాలా మంచి ఇన్విటేషన్స్ పంచారట. మరిన్ని గొప్పతనాలుండగా నందిపాటి జానయ్య గాని, చిత్ర గాని, సమాన్య లెలా అవుతారు?

పోనీ 'చిత్ర' కూతురు శిల్ప విషయానికి వద్దాం! 'శిల్ప' జె.ఎన్.టి.యులో ఇంజనీరింగ్ సీటుసాధించారు. దాన్ని మధ్యలోనే వదిలేసి మళ్ళీ ఫైన్ ఆర్ట్స్ లో చేరారు. ఒక సామాన్య విద్యార్థినికి ఇది సాధ్యమేనా? ఇక్కడ ఈమె ప్రస్తావన ఎందుకంటే, తన తాత, తండ్రుల వారసత్వం శిల్పకు తెలియకుండానే ఏర్పడిందనే రచయిత వాదన ఒక ప్రాచీన సంప్రదాయానికి జీవం పోసేటట్లు



అవుతుందేమో చూద్దానికే! నిజంగా వారసత్వమే వృత్తి నైపుణ్యానికి కారణమైతే, అది ఒక ప్రమాద కరమైన సిద్ధాంతాన్ని స్థిరీకరించే ప్రయత్నమే తప్ప, సామాన్యత ఏమీ ఉండదు. ఇది రచయత ఆలోచించ వలసి ఉంది. ఇక చిత్ర లో సామాన్యతను రచయిత గుర్తించ గలిగారా? లేదా? అనే విషయాన్ని చూద్దాం!

1) కులం కొందరికి హీనత్వాన్ని, మరి కొందరికి ఉన్నతత్వాన్ని కలిగిస్తుంది. 'చిత్ర ' పేరు విఘ్నేశ్వరాచారి అని ముందే చెప్పుకున్నాం! తన పేరులో కులం చాయలు కనిపిస్తున్నాయి కనుక, ఆ నీలినీడలు పడకుండా ఉండాలనుకోవటంలో సామాన్య జీవన ఆశయం ఉంది.

2) జీవితంలో పొదుపు గురించి ' చిత్ర ' ది సామాన్యమైన ఆలోచనే! నీళ్ళలో సబ్బు తెలియడుతున్నా, షాంపూ ఒలికిపోతున్నా దేన్నీ వృధా కానివ్వకూడదనే మనస్తత్వంలో సామాన్యతే ఉంది.

3) ' చిత్ర ' కి చిన్నతనం లో సరైన బట్టలు లేకపోవటం, అందువల్ల మిత్రుడి జీన్ ఫాంట్, షర్ట్ తీసుకొని, ఇత్తడి చెంబుతో ఇస్త్రీ చేసుకోని, ఆ బట్ట లేసుకొని, ఎక్కడెక్కడ ఆ బట్టలను ప్రదర్శించాలో అక్కడ వాటిని ప్రదర్శించి గాని మళ్ళీ తిరిగి రాక పోవటంలో ఒక సామాన్య బాలుడి జీవితానుభవమే పుస్తకంలో రచయిత ప్రదర్శించగలిగారు.

4) 'చిత్ర ' బాల కార్మిక జీవితాన్ని అనుభవించినా, తన చిత్రాల్లో ఆ బాల కార్మికుడు ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉన్నట్లు, కుటుంబంతో కలిసి మెలిసి ఉన్నట్లు అనేక చిత్రాలను చిత్రించటంలో కళాకారుడి ఆశల్ని చిత్రాల్లో చిత్రించారని రచయిత చెప్పటంలో ఇది సామాన్యశాస్త్రం ఎలా అవుతుందో చెప్పగలిగారు.

5) నిజానికి 'చిత్ర' చదువు కొనసాగక పోవటానికి, డబ్బులివ్వకుండానే చేపలమ్మే మనిషికి ఇచ్చేశానని గుర్తించ ఒట్టేసుకోవటం వల్లనే తన చదువు ఆగిపోయిందేమో అనే అర్థం కాని నమ్మకంలో సామాన్యతే ఉంది.

6) డాక్టరు దగ్గర శిల్పాలు చేసి, ఇంటికి వెళ్తానని డబ్బులివ్వమని గొడవ పడటంలో ఒక సామాన్యుని ఉద్విగ్న స్వభావమే కనిపించింది.

7) ఒక బాల కార్మికుడిగా పని చేయలేక పారిపోయి వచ్చి, ఆ జీవితాన్ని ఒక శిల్పం గా మార్చు కోవటంలో గొప్ప పరిణామం ఉంది. ఆ

పరిణామాన్ని గుర్తించటం ద్వారా వదిలి వేయవలసినవేమిటో, స్వీకరించవలసినవేమిటో? అనే విజ్ఞతను ఈ బాలుడిశిల్పం గ్రంథం చదివిన పాఠకులు గ్రహించగలుగుతారు.

దేవుడి విగ్రహం తో పాటు కళాకారుణ్ణీ ఊరేగించటం, యన్. టి. ఆర్. తో పరిచయం, పూనం కౌర్ ఇన్విటేషన్స్ పంచటం వంటివన్నీ ఒక సామాన్యుడి లో అంతర్నిగూఢంగా దాగి ఉన్న కళాకారుడివే! అందుకే అతడు కళాకారుడిగా 'చిత్ర'. అంత కళా కారుడైనా జీవించేది ఒక సామాన్య మానవుడిగానే!! ఆ జీవితమే రచయిత ఇక్కడ చూపాలనుకున్నాడా?

రచనా ప్రణాళికలో కొంత లోపం కనిపిస్తున్నా వీటిలో మలి ముద్రణలో సరి చేసుకోదగిన అవకాశం ఉంది. వాటిని గమనించ గలిగితే, నిజంగా మన మధ్య బతికిన మనుషుల గురించి ఆయనే (రచయిత) కాదు, ఆ పుస్తకాలను చదివిన వాళ్ళు చాలా మంది మరెంతో మంది జీవితాలను అక్షరీకరించే పనిలో నిమగ్నం కాగలుగుతారు.

ఈ పుస్తకంలో టెక్నిక్ గురించి కూడా ఒక మాట చెప్పుకోవాలి. రచయిత తాను చెప్పాలనుకున్న దాన్ని ఆకర్షణీయంగా చెప్పటానికి రెపోర్టింగ్ టెక్నిక్ ని ఎన్నుకున్నారు. చిత్ర గురించి కూడా ఓ మాట చెప్పాలి. రచయిత ఆయన్ని పరిచయం చేశారు. అందువల్ల వెంటనే ఆ "చిత్ర" కారుని నేపథ్య కథనం వినపించారు. అక్కడక్కడా 'చిత్ర ' చేతనే మాట్లాడించారు. అంటే ఆయన మాటలను ఉటంకించారు. చిత్ర గురించి సమకాలీన రచయితల, కళాకారుల అభిప్రాయాలను క్రోడీకరించారు. టి.వి. స్క్రీన్ పై 'చిత్ర' కనిపిస్తుంటే రెపోర్టర్ స్క్రిప్టుని వినిపించినట్లు రాయగలిగారు. ఇదంతా రెపోర్టింగ్ టెక్నిక్కే! తన వృత్తిలో సాధించిన నైపుణ్యాన్ని ఇలా రచయిత వాడుకోవటం వల్ల పరిశోధకులు, విమర్శకులు కవి/రచయితను వేరు వేరుగానే రచనను అనువర్తించాలా? అనుసందించీ చూడాలా అనే కోణం కూడా ఈ పుస్తకం అందించగలుగుతుంది. ఒక మంచి పుస్తకాన్ని రాసిన రచయిత కందుకూరి రమేష్ బాబుని మనసారా అభినందిస్తున్నాను.

(http://.thatstelugu.oneindia.inలో 25- 09- 2006 న ప్రచురితం.)



# దళితకవిత్వంలో స్థానీయ కోణం
## *"అట్లేటి అల"*

*"ఊరికి అచ్చరమైన అయ్యని కాదని*
*లెక్కలోకే రాకుండా*
*అసలు బడి మొకమే సూడనోడు*
*రచ్చబండవ్వడం*
*తాటాకు మంటైతంది అల"* ----ఇది జి.వి. రత్నాకర్ 'అట్లేటి అల' దీర్ఘకావ్యంలోని ఖండిక! ఇక్కడ ' అయ్య ' చదువుకున్న రెండవ తరంలోని దళితులకు ప్రతీక. సమాజంలో చదువుకున్న దళతులను గౌరవించకుండా, చదువుకోక పోయినా తమ కులాధిక్యం వల్ల గౌరవింపబడటాన్ని గమనిస్తున్న దళిత చైతన్యానికి ప్రతీక ' అల 'నిజానికి దళితులకు ఎన్నో సౌకర్యాలను ప్రభుత్వం సమకూరుస్తున్నా, స్వచ్ఛంద సంస్థలు సహకరిస్తున్నా, దళితులు విద్యా, ఉద్యోగ రంగాలలో తమ అస్తిత్వాన్ని నిరూపించుకుంటున్నా, గ్రామాల్లో కులాధిపత్యమే అధికారాన్ని, గౌరవాన్ని పొందుతుంది. ఈ స్థితిని పై కవితా ఖండికలో సమర్ధవంతంగా వర్ణించగలిగాడు కవి.

అంతే కాదు గతానికీ వర్తమానానికీ మధ్య వ్యత్యాసాలను గమనిస్తున్న చైతన్యం "అల" నిండా కనిపిస్తుంది. నిజానికి దళిత

సాహిత్యంలో గతాన్ని స్మరించుకొంటూ, వర్తమానాన్ని నిర్మించుకొంటూ, భవిష్యత్తుకి బాటలు వేయటం అనేది చైతన్యవంతమైన వారి రచనల్లో స్పష్టమవుతుంది. అది రత్నాకర్ కవిత్వంలోనూ ఉంది. అయితే, రత్నాకర్ ఈ దీర్ఘ కావ్యంలో ఒక విశిష్టతను మిళితం చేశాడు. స్థానీయ అస్తిత్వ కోణంలో దళిత సమస్యలను ఒక దీర్ఘ కావ్యమంతా విస్తరించి వర్ణించగలిగాడు. ప్రకాశం జిల్లా పరిసరాలన్నీ ఈ కావ్యం నిండా దళిత పరిమళంతో అలముకుంటాయి. భాష, భావం, వ్యక్తులు, వివిధ సంఘటనలు వంటివన్నీ దళిత జీవితం నుండే ప్రవాహమై ఉరికాయి. శిఖామణి గారన్నట్లు కవి చుట్టూనే కావ్య వస్తువు అలముకుంది. కానీ, దాన్ని వ్యక్తిగతంగానే వర్ణించకుండా దళిత జీవితాలన్నింటినీ అందులో చూసుకోగలిగేటట్లు చేయగలిగాడు కవి. అంతేకాదు దళిత భాష విషయంలో రత్నాకర్కి ఒక ప్రత్యేకమైన శైలి ఏర్పడుతున్నది. అది అంతకు ముందు రాసిన 'మట్టిపలక' లోనూ కనిపిస్తుంది. ఆ భాషా మాండలిక ప్రయోగాలతో కవిత్వం స్థానీయతకు మరింతగా పరిపుష్టికి దగ్గరయ్యింది. డా// నాగభైరవ కోటేశ్వరరావు గారు ఈ కావ్యలోని కొన్ని పదాలను వివరించారు.

మాల-మాదిగలు ఇరువురూ కలిసి మెలిసి ఉండటాన్నీ, కలహించు కోవటాన్నీ కూడా ఈ దీర్ఘ కావ్యం రికార్డ్ చేయగలిగింది. ఇరువురికీ మధ్య విభేదాలు పెట్టి తమ ఆధిక్యాన్ని చెలాయించుకొనే అవకాశవాద అధికారాన్నీ వర్ణించే ప్రయత్నం పుస్తకంలో కనిపిస్తుంది.

"*ఊరికి రెండు కళ్లల్లా/ మాల మాదిగ పల్లెలు/ నడుంగున ముల్లగర్రవుతున్న ఊరు/ అట్లేరు, ఆ మంచీల్ల సెలం కాడి తేడాలు/ రచ్చబండ, ఆ పంచెల్ల తీర్పులు/ గోచి గుడ్డలు ఆటి గోస/ అర్థమయ్యేవి కాదు అలకి" (పు:24)* ఇలాంటి చోట్లలో అల కవి జీవిత దశగానే మారిపోతుంది. ఒకానొక దళిత జీవిత దశను ఇక్కడ అల చూపుతుంది. ఇంకొంచెం ప్రయత్నించి ఉంటే అలను బలమైన ప్రతీకగా మార్చగలిగే అవకాశం ఉండేది. మరో విశేషం చెప్పుకోవాలి వర్తమాన దళితుని విద్యా మనస్తత్వాన్ని ఒకచోట ప్రశంసనీయంగా రాశాడు కవి.

*"రథం కాడి బడిలో కూసుని/ ఇసికలో అచ్చరాలైన అయ్యని/ చూసి ఆకసమౌతుంది అల" (పు:20)*. దళితుడు ఒకప్పుడు విద్యా తృష్ణ



తీర్చుకోవటానికి పడిన ఆరాటాన్నీ, ప్రస్తుతం అనేక ఉన్నత డిగ్రీలను దళితులు సాధించటం వెనుకున్న కారణాన్ని గొప్పగా అభివ్యక్తీకరించాడు. నేడు దళితుడు చదువు కోవటమనేది కేవలం ఉద్యోగం కోసమే కాదు. ఒకప్పుడు దళితులకు చదువురాదన్నారు. వస్తుందని నిరూపించారు దళితులు. ఇంకా దళితులకే చదువు బాగా వస్తుందనే నిరూపణలు చేయాలనే ప్రయత్నం కూడా కనిపిస్తుంది. ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి గారు ముందుమాటలో అన్నట్లు *'దళిత జాతిని తాకిన అక్షరాలిప్పుడు పవిత్రమౌతున్నా యి'*. ఈ సందర్భంలోనే ఒక విషయాన్ని చర్చించుకోవాలి.

ఈ దళిత కవిత్వంలో ధ్వని గురించి ఆచార్య కృపాచారి గారు విశ్లేషించారు. చాలా మంది దళిత కవులు ఇలాంటి కవిత్వాని రాస్తున్నారు. ఈ పరిస్థితుల్లో దళిత కవిత్వంలో ఆలంకారిక ప్రయోగాల గురించి అధ్యయనం జరగ వలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. శూద్రులనేది చాలా విస్తృతమైన పరిధిని కలిగిన పదమైపోయింది. ఒకప్పుడు రెడ్డి, చౌదరి, నాయుడు వంటి వారంతా శూద్రులుగానే పరిగణన పొందేవారు. ఇప్పుడు ఆ వర్గాల నుండే వేద రక్షణ విస్తృత స్థాయిలో జరుగుతున్నది.

కవిత్వం కూడా వస్తున్నది. కనుక అప్పకవి నిరసించిన శూద్రుడెవరు? అనే విషయాల్లో ప్రమాణాల్లో మార్పులు వస్తున్నాయి. కనుక వర్తమానాన్ని గమనిస్తూ కవితా నిర్మాణాలను కూడా పెంచుకుంటూ పోవవలసిన అవసరం కనిపిస్తుంది. శూద్రుడు రాసిన కవిత్వాన్ని వ్యతిరేకించిన అప్పకవి సిద్ధాంతాలను ఎంతవరకూ వ్యతిరేకించాలో కూడా దళిత కవులు లోతైన ఆలోచన చేయవలసిన అవసరం ఉంది. మొత్తం మీద ప్రతి జిల్లానుండీ ఇలాంటి దీర్ఘ కావ్యాలు రావాలనే ఆలోచనను కూడా ఈ కావ్యం ప్రేరేపిస్తుంది. అనేక దీర్ఘ కావ్యాలొచ్చినా, దీనికొక ప్రత్యేకత ఉందని పై అంశాలను బట్టే చెప్పవచ్చు. ఇటీవల దళిత కవిత్వం రావటం లేదనుకొనేవారు వెంటనే చదవవలసిన పుస్తకం.

(అట్లేటి అల (దీర్ఘ కావ్యం ) కవి: డా.జి.వి.రత్నాకర్,ప్రతులకు: ప్రజాశక్తి, విశాలాంధ్ర బూక్ హౌస్ అన్ని శాఖలు.పుటలు: 60, ఖరీదు:రూ:30/)

(http://.thatstelugu.oneindia.in లో 02-12-2006 న ప్రచురితం.)

# పరిమళించే 'జాతీ'యతే ఈ "స్వగతము"

కవిత్వమంతా జాతీయతను పరిమళింప చేసే కొద్ది మంది పద్య కవులలో 'మధురకవి' మల్లవరపు జాన్ కవి గారు ఒకరు! ఆయన రచనల్లో అముద్రితంగా ఉండిపోయిన ఖండ కావ్యం ఈ "స్వగతము". దీన్ని ప్రచురించాలని భావించి నన్ను అభిప్రాయం రాయమన్నారు.

దీనిలోని ఇతివృత్తం జన్మరీత్యా ఒక మాదిగవాని స్వగతం. ఇంకా లోతుగా చెప్పాలంటే కులం వల్ల జీవితమంతా అవమానాల పాలై తన అస్తిత్వానికై తపన పడిన ఓ దళితుని స్వగతం దీనిలో వినిపిస్తుంది. మాదిగ జీవితం చుట్టూ ఆ వర్ణన కొనసాగినా రకరకాల జీవితానుభావాలను ఎదుర్కొంటున్న ప్రతి దళితుని ఆవేదనను ఈ "స్వగతం"లో అక్షరీకరించగలిగారు.

ఈ "స్వగతము"ను ఏ ప్రక్రియగా చెప్పుకొనే వీలుందనుకొంటూ చదివాను. మన లాక్షణికులు "ఖండకావ్యం, ఆఖ్యానం, ఆఖ్యాయిక వంటి వాటికి సమానమైన పోలికలున్న కొన్ని లక్షణాలను చెప్పారు. *"ఖండ కావ్యం భవేత్కావ్యస్యైకాదేశనుసారిచ"* అని 'సాహిత్య దర్పణం' ఖండకావ్యం అంటే ఏమిటో వివరిస్తుంది. కవి తాను స్వయంగా చూసిన దాన్ని చెబితే (*స్వయం*



*దృష్టార్థ కథనం ప్రాహురాఖ్యానం బుధా*) దాన్ని 'ఆఖ్యానం' అని అంటారు. 'కల్పితేతివృత్తం కలిగినదాన్ని కథ' అని 'సత్యేతివృత్తాంతం కలదాన్ని ఆఖ్యాయిక (*కథ కల్పిత వృత్తాంతా సత్యార్థాఖ్యాయికా మతా*) అని లక్షణాలు వివరిస్తున్నాయి. కావ్య నాయకుడే స్వయంగా ఆ రచనలో తన వృత్తాంతాన్ని తెలిపినట్లయితే దాన్ని ఆఖ్యాయిక (*వృత్తమాఖ్యాయతే యస్యాం నాయకేన స్వచేష్టితం*) అంటారని లాక్షణికులు అంటున్నారు. అయితే, మల్లవరపు జాన్ కవి గారు రాసిన "స్వగతము"లో గేయ లక్షణాలున్నప్పటికీ అంతకు మించి ఒక అంశాన్ని హృద్యంగా వర్ణించే లక్ష్యమే ప్రధానంగా కనిపిస్తుంది.

దళితుని జీవితంలో కులం కేంద్రంగా జరిగే అకృత్యాలను ఏక దేశంగా వర్ణించగలిగారు కవి. అలా వర్ణించటంలో బిగువు కూడా ఖండ కావ్యానికే బాగా ఒదుగుతుంది. అది ఈ 'స్వగతం'లో ఉంది. అలా గేయంలో కూడా ఖండకావ్యం రాయవచ్చనని నిరూపించారు. ఈ రచనలో కవి తన కథనే చెబుతున్నట్లు అనుకుంటే, దీన్ని ఆఖ్యానం అనుకోవడానికి అవకాశం ఉంది. కానీ, కవి తన విషయాలు కాకుండా తను ఒక జాతికంతటికీ ప్రతినిధిగా వివరించారు. కనుక, ఆఖ్యానం అయ్యే అవకాశం లేదు. పోనీ సత్యార్థ కథమే ప్రధానం అనుకుందామంటే "స్వగతం" నిండా జీవిత వాస్తవికతే ఎక్కువగా కనిపిస్తుంది. అంతకు మించి ఒక జాతి జీవితం చుట్టూ ఉన్న జీవన వ్యథంతా కనిపిస్తుంది. ఇవన్నీ ఖండకావ్యాల్లో కనిపించే కొన్ని లక్షణాలు. కనుక, దీన్ని 'ఖండకావ్యం' అని పిలవడం సమంజసమేమో!

కొన్ని వందల సంవత్సరాలుగా తెలుగు వారికి వారసత్వ సంపదగా కొనసాగుతున్న ఛందోబద్ధ కవిత్వంలో మాత్రా ఛందస్సు కూడా ఒక భాగమే! గురజాడ అప్పారావు గారి 'ముత్యాల సరాల'లో సంస్కరణ భావాలు కనిపిస్తాయి. మల్లవరపు జాన్ కవి గారు కూడా ఈ ఖండ కావ్యాన్ని మాత్రా ఛందస్సులోనే వర్ణించారు. సంప్రదాయంలో ఉంటూనే నవీనత్వాన్నీ కోరుకోవడానికి ఈ 'నవ్య సంప్రదాయ కవి' మాత్రా ఛందస్సుని ఒక మార్గంగా ఎంచుకున్నారు. ఆ మాట కొస్తే ఆయన ప్రతి రచనలోనూ సంప్రదాయంలో నవ్యత్వాన్ని కోరుకోవడం కనిపిస్తుంది.

జాతీయోద్యమ కాలంలో గాంధీజీ కుల నిర్మూలనను కూడా ఒక అంశంగా చేర్చారు. తొలి తరం దళిత కవులలో ముఖ్యంగా కుసుమ ధర్మన్న, గుర్రం జాషువ, బోయి భీమన్న మొదలైన కవులలో ఆ ప్రభావం ఎక్కువగానే కనిపిస్తుంది. అలాంటి ప్రభావమే మల్లవరపు జాన్ కవి గారి కవిత్వంలోనూ ఉంది. ఆ ప్రభావాన్ని ఆయన రాసిన ఇతర రచనలలో కూడా చూడవచ్చు. ఈ ఖండ కావ్యంలో ఆ ప్రభావాన్ని వర్ణిస్తూ ........

*"అంటరాని తనంబు పోవలె*

*అందరొకటై మెలగవలెనని*

*స్వరాజంబు తెచ్చుకోవలె"*

నని సంస్కరణ వాదులు భావించారంటారు కవి. అలా దళితులందరిని కలుపు కొని జాతీయోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించి, స్వాతంత్ర్యాన్ని సాధించడానికి నాయకులు బాటలు వేశారు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా కుల నిర్మూలన మాత్రం జరగలేదు. దళితులకు అందవలసిన విద్యా సౌకర్యాలను అందనివ్వకుండా అడ్డుకున్నారు. అంతేకాదు చాలా మంది, విద్యాలయాలకు వచ్చే దళితులను అస్పృశ్యులని అవమానించారు. అయినప్పటికీ విద్యాసక్తి గల దళితులు ఆ అవమానాలను సహిస్తూనే అక్షరాలు నేర్చుకున్నారు. అలా నేర్చుకోవడం వెనుక ఎంతో దయనీయ స్థితి ఉందంటూ కవి .....

*"అంటరానితనంబు చనెనని*

*అయ్య నను బడికంపినప్పుడు*

*కండ్లురిమి నాపై ఱాళ్ళ"*

కర్రలను విసిరేవారని ఆ చారిత్రక పరిణామక్రమాన్ని వివరించారు. అంతే కాకుండా జానపద గేయాలు, బుర్ర కథలు, హరి కథలను వినడం ద్వారా మౌఖికంగానే విద్యనభ్యసించిన అనేక మంది దళితుల విద్యాభ్యాస



విధానాన్ని, దాని వెనుకున్న వేదనామయ జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించారు కవి.

మొత్తం మీద ఈ ఖండ కావ్యంలో దళితుని జీవితాన్ని వర్ణించడానికి మాదిగ సాంస్కృతిక జీవనాన్ని కేంద్రంగా చేసుకున్నారు. దళితుని వేదన, పనిలో నైపుణ్యం, దళితుల పట్ల సంస్కరణ రూపంలో జరిగే మోసం, దాన్ని ఎదుర్కోవడానికి కొంత మంది దళితులు ప్రదర్శించే ఆగ్రహావేశాలు, అలాంటప్పుడే మరి కొంత మంది దళితులు ప్రదర్శించే సంయమనం, ఆ సంయమనానికి సామాజిక సంబంధాలను, పురాణేతిహాసాలను హేతు పూర్వకంగా చూపడం, దళితులు కూడా పాలకులుగా ఉన్న చారిత్రక వారసత్వాన్ని విశదీకరించడం వంటివన్నీ 'కొండ అద్దమందు కొంచమై ఉండదా' అన్నట్లు వర్ణించ గలిగారు. ప్రజాస్వామిక, లౌకిక మానవతా వాదాన్ని స్థాపించే జాతీయతా స్ఫూర్తి ఈ రచన నిండా కనిపిస్తుంది. దీన్నంతటిని కవి ఒక భారతీయ పౌరుడిగా తన జన్మభూమిపై ఆత్మవిశ్వాసంతో, ఆత్మగౌరవంతో నిలబడి మాట్లాడే ఒక దళితుని స్వరంగా వినిపించారు.

దేశీయతను, సంప్రదాయ వారసత్వాన్ని కొనసాగిస్తూనే అవాంఛనీయ ధోరణులను సంస్కరించుకొనే నవ్య సంప్రదాయవాద కవిగా మల్లవరపు జాన్ కవిగారిని ప్రతిష్ఠాపించే ఖండ కావ్యమిది. వస్తు ఛందో నవ్యతను ప్రదర్శించే ఈ కావ్యాన్ని పాఠక లోకానికి అందించే ప్రయత్నం ఎంతో అభినందనీయం.

(06-12-2006న మల్లవరపు జాన్ కవి గారి "స్వగతము"కి రాసిన ముందుమాట)

# పరిమళించే ప్రేమబంధమే

## "క్రీస్తు ప్రబంధం"

వచన కవిత్వానికి లభించినంత ప్రాధాన్యత పద్య కవిత్వానికి పత్రికల్లో దొరకక పోవటం వల్ల, పద్య కావ్యాల గురించి తక్కువగా తెలుస్తుంది. కానీ, పద్య కవిత్వాన్ని చాలామంది రాస్తూనే ఉన్నారు. అలాంటి పద్య కవుల్లో డాక్టర్ ఎస్. టి. జ్ఞానానందకవి ఒకరు. ఇటీవల సుమారు 280 పైగా పద్యాలతో "క్రీస్తు ప్రబంధం" రాశారు. అంతకు ముందు బౌద్ధ ధర్మనాన్ని విశదీకరించే 'ఆమ్రపాలి' కావ్యం రాశారు. ఈ కావ్యం సాహిత్య అకాడమీ అవార్డు పొందింది. హిందూ ధర్మాన్నీ, సంస్కృతినీ విశ్వ విఖ్యాతం చేసిన స్వామి వివేకానంద గురించి 'శ్రీ వివేకానంద గానం'లో వర్ణించారు. ఇంకా, మత సామరస్యాన్ని చాటే 'గోల్కొండ', సామాజిక సంఘర్షణకు సంబంధించిన 'ధర్మాగ్రహం' వంటి కావ్యాల్నీ రాశారు. వీరు రాసిన ఈ కావ్యాలను బట్టి నిజమైన లౌకికవాద కవిగా డాక్టర్ ఎస్. టి. జ్ఞానానందకవి కనిపిస్తారు.

కవులు కొన్ని వస్తువుల్ని తమ కావ్య ఇతివృత్తంగా మార్చుకునేటప్పుడు కొన్ని ఇబ్బందులు ఉంటాయి. మత విషయాలను కావ్య వస్తువులుగా తీసుకున్నప్పుడు మరింత జాగ్రత్త వహించవలసి ఉంటుంది. జ్ఞానానందకవి గారు 'క్రీస్తు ప్రబంధం'లో క్రీస్తుని కేంద్రంగా



చేసుకున్నా, బైబిలులో గల పాత నిబంధన, కొత్త నిబంధనలలో గల అనేక అంశాల్ని చాలా జాగ్రత్తగా వర్ణించారు. సమకాలీన క్రైస్తవ సోదరులకు మానవ సంబంధాల్లో వస్తున్న మార్పుల్ని వివరిస్తూనే, అవన్నీ ప్రేమానుబంధాలుగా మారాలనే ఆకాంక్షను వ్యక్తం చేస్తున్నారు. ఈ 'క్రీస్తు ప్రబంధం'లో గుర్రం జాషువాగారు రాసిన అభిప్రాయాన్ని ప్రచురించారు. నిజానికి గుర్రం జాషువా 1944లో రాసిన అభిప్రాయం. 'కవితా లోకంలో మీకు గల గౌరవం క్రైస్తవ లోకంలో కూడా కలిగితే మీ శ్రమ సార్ధకమవుతుందని గుర్రం జాషువా వ్యాఖ్యానించారు. జాషువా ఆంతర్యం ఏమై ఉన్నా, క్రైస్తవుల్లో, క్రైస్తవేతరుల్లోనూ సార్ధకమైన జీవితాన్ని ఆశిస్తున్నారు కవి.

కొంతమంది కవులు రాసే దాన్ని బట్టి ఆ కవి దృక్పథం స్పష్టంగా గుర్తించే వీలుంది. గుర్రం జాషువా రచనల్ని బట్టి పరిశోధకులు, విమర్శకులు భిన్న దృక్పథాలలో, అభిప్రాయ భేదాలతో నిర్ణయాలు చేశారు. జాషువాని నాస్తికుడనీ, ఆస్తికుడనీ, క్రైస్తవుడనీ, బాప్తిజం తీసుకోలేదనీ, హేతువాదనీ, విశ్వనరుడనీ, మానవతా వాదనీ ఇలా అనేక రకాలుగా నిర్ణయించిన విమర్శకులు ఉన్నారు. డాక్టర్ జ్ఞానానందకవిలో ఇన్ని అభిప్రాయ భేదాలు లేకపోయినా, 'కవి దృక్పథం' ప్రకటించటం కొంచెం ఇబ్బందికరమే! ఇలాంటి సందిగ్ధ పరిస్థితుల్లో, అన్ని కోణాలకీ మూల కేంద్రమైన మానవ సంబంధాలు, వీటిలోనూ పీడనకు గురవుతున్న వాళ్ళ పక్షమే 'కవి' వహించటం ఉంటుంది. అయితే, నీతి, ధర్మం, న్యాయం వంటివి ఆయా సమాజాల్ని బట్టి మారుతుంటాయి. కనుక, తన సమాజం నుండే, తాను అవగాహన చేసుకున్న జీవిత కోణాల నుండే తన సాహిత్యాన్ని ఉత్పత్తి చేస్తుంటాడు. డాక్టర్ జ్ఞానానందకవి కూడా వీటికి అతీతులు కారు.

'క్రీస్తు ప్రబంధం' భారతీయ కావ్య లక్షణాల్ని అనుసరించి 'శ్రీమన్మంగళ మూర్తి....' అంటూ ప్రారంభించి, 'స్వస్తి లోకానకున్' అని ముగించారు. 'ప్రబంధం' అని ఉండడం వల్ల, తెలుగు ప్రబంధాలలో లక్షణాల్ని స్ఫురింపజేస్తున్నా, 'క్రీస్తు'కి సంబంధించిన కథల్ని ఒకచోట చేర్చి, క్రీస్తు బోధనల్ని వివరించారు. ఆ విధంగా 'క్రీస్తు ప్రబంధం' క్రీస్తుకి సంబంధించిన కథలు, బోధనలతో ప్రకృష్టంగా ఏర్పడిన బంధం. ప్రబంధానికి ఉండే కొన్ని

వర్ణనలు కూడా ఉన్నాయి. అష్టాదశ వర్ణనలు, రసం వంటి విషయాల్లో ప్రత్యేక పద్ధతి కనిపిస్తుంది.

ఈ లోకంలో ప్రేమానుబంధాల్ని పెంచడానికీ, పాపాత్ములను (?) పుణ్యాత్ములుగా మార్చటానికీ, పరలోక మార్గాన్ని స్థిర పరచటానికీ వచ్చిన దివ్య కుమారుడిగా 'క్రీస్తు' ని కవి వర్ణించారు. కావ్యం చదివే పాఠకుడికి క్రైస్తవ మత బోధనలు ప్రధానంగా అవగాహనకొస్తున్నా, సమకాలీన సంఘటనలతో సరిపోల్చుకుంటూ విధ్వంసాలకూ, హింసలకూ కారణాలవుతున్న సంఘటనలు స్ఫురణ కలిగి, అవి శాంతియుతంగా మారాలంటే, ప్రేమానుబంధాలు కావాలంటే మనిషిలో మానవత్వం మేల్కొనాలనే కోణం పాఠకుడిలో ఏర్పడుతుంది. మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలవుతున్న పరిస్థితుల్లో, పవిత్రంగా, స్వచ్ఛంగా ఉండవలసిన శిష్యుడు కూడా డబ్బు ఆశతో క్రీస్తుని చంపాలని ప్రయత్నించిన వారికి సహకరిస్తాడు. నాటి సమాజ 'ఆర్థిక సంబంధాల'కీ, నేటి ఆర్థిక సంబంధాలకీ వ్యత్యాసం ఉన్నా, 'మహిమాన్వితుణ్ణి' కూడా ధన ప్రలోభం వల్ల క్రీస్తుని హింసించే మార్గాన్ని చూపడానికి కూడా వెనుకాడని స్పృహను పాఠకులు అందుకోగలుగుతారు. క్రీస్తుని శిలువ వేసిన తర్వాత తల్లి మరియమ్మ హృదయాన్ని కవి వర్ణిస్తూ...

*'నిన్నటి దాక భక్తి మెయి నీ పద పద్మములన్ భజించు వా*
*రెన్నగ నిన్ను దూషణపు హేళన చేయుచునున్న వారు నే*
*డన్న! భవన్మహోన్న తపు టద్భుతముల్ గనినట్టి వారు నీ*
*కన్ని విధాల శత్రువులుగనైరి కృతఘ్నుల్ క్రూరకర్మకుల్'*

అన్నారు. ఇది క్రీస్తుని శిలువ వేసినప్పటి పరిస్థితిని వర్ణిస్తున్నా, దాన్ని మాత్రమే కాకుండా నేడు కొందరు క్రైస్తవులుగా మారి దాన్ని ఆర్థిక లావాదేవిలకు మార్గంగా చేసుకుంటున్న వాళ్ళూ, క్రైస్తవంలో కూడా ప్రవేశించిన 'కులం' లో అధిపత్యాన్ని చెలాయిస్తున్న వాళ్ళూ స్ఫురించి, క్రైస్తవాన్ని మంటగలుపుతున్న వాళ్ళ పనులూ గుర్తుకొస్తాయి. కవిలో 'క్రైస్తవం' పట్ల గల లోతైన అనుభవం, ఆలోచనల స్పష్టత దీనిలో కనిపిస్తుంది. క్రీస్తు దేనికోసమైతే శిలువకి 'బలి' కాబడ్డాడో ఆ ప్రేమబంధాల పట్ల కవి తపన పడుతున్నారు.



కావ్యాన్ని ప్రారంభిస్తూ, క్రీస్తుని, మరియమ్మ, యోసేపు, ఆదాము అవ్వలను, అబ్రహాము, దేవదూతలు జఖాయేల్, గాబ్రియేల్, ఇజ్రాయేల్ని తన వాక్ శక్తితో నడిపించిన మోషే తర్వాత యోజోవా, దావీదు, సాలోమోను, ప్రవక్తలు, మత్తియి, మార్కు, లూకా, యోహాను పాలు వంటి వారందరినీ స్మరించి, వారి దీవెనలను ఆశించి 'నా జాతి పావనమౌరీతి' రచింతు నా ప్రభుని దివ్యంబైన చారిత్రమున్' అని కవి ప్రకటించుకున్నారు. పాత నిబంధన నంతటినీ సంక్షిప్తంగా, సారాన్ని కొన్ని పద్యాల్లో వర్ణించేసి, క్రీస్తు పుట్టుకకు వర్ణనను తీసుకుకొనిపోయారు.

క్రీస్తుని దైవంగా వర్ణిస్తూ 'సత్యవాక్కు చేత సర్వసర్వం సహా / చక్రగతికి మూల సాధకుండు / జీవ జాలములకు దేవాదిదేవుండు / ప్రభవ మందినాడు పనుల సాల' (పు: 40) అన్నారు. ప్రపంచంలో సత్యంతో ప్రవర్తిల్లాలనీ, దాని కోసమే జీవ జలాన్ని తాగించి, నిత్య జీవితాన్ని ప్రసాదించడానికి పుట్టిన మహోన్నుడిగా క్రీస్తుని ప్రశంసిస్తూ రాసిన ఈ పద్యం, ఛందోబద్ధమే అయినా, నేటి వచన కవిత్వం కంటే సరళంగా ఉండి, చక్కని కవిత్వాన్ని పండిస్తుంది. క్రీస్తు బోధనలు ప్రస్తుత ప్రపంచానికి అవసరం అనేది కవి ఆలోచన. క్రీస్తు బోధనల్ని సరళమైన పద్యాల్లో అందించిన డాక్టర్ జ్ఞానానందకవి ఈ కావ్యంలో నిజమైన 'లౌకిక కవి'గా ప్రశంసించబడతారు.

(క్రీస్తు ప్రబంధం, కవి: డాక్టర్ ఎస్. టి. జ్ఞానానందకవి, పుటలు: 285, ప్రతులకు; డాక్టర్ ఎస్. టి. జ్ఞానానందకవి, దంతులూరి వారి వీధి, పేర్రాజు పేట, కాకినాడ 533003, వెల: 100 రూపాయిలు.)

(ఆంధ్రప్రభలో 17-10-2005 న ప్రచురితం)



# Sahiti Sulochanam

- Darla Venkateswara Rao

ఈ పుస్తకంలో పద్య, వచన, దీర్ఘ
కవిత్వం, కథ, నవల మొదలైన
ప్రక్రియలకు సంబంధించిన పుస్తకాల
సమీక్ష ఉంది. ఆయా పుస్తకాల్లోని వస్తు,
శిల్ప విషయాలతో పాటు రచయిత
దృక్పథం కూడా వివరించడానికి
ప్రయత్నించాను.
ఈ సమీక్షలన్నీ ప్రముఖ పత్రికలలో
ప్రచురితమైనవే!